











# Heroes start early.

Ride, race, take a tumble or even take a fall.

Because it's never too early to be a hero.



ఈ నెల విశేషాలు

సంపుటి 109 జూలై 2003 సంచిక 1



విద్యావంతుడు (బే.క) 15



బదిలీ అయిన అదృష్టం 56



మాయాసరోవరం 9



యువరాణి చందమామలు 67



## ఈ సంచికలో...




SUBSCRIPTION

**For USA and Canada**
**Single copy $2**
**Annual subscription $20**

*Remittances in favour of Chandmama India Ltd.*
to
Subscription Division
CHANDAMAMA INDIA LIMITED
No. 82, Defence Officers Colony
Ekkatuthangal, Chennai - 600 097
E-mail : subscription@chandamama.org

చందా

ఎయిర్ మెయిల్ ద్వారా అన్నిదేశాలకు
పన్నెండు సంచికలు రూ: 900
ఇండియాలో బుక్‌పోస్ట్ ద్వారా రూ.120లు
చందా డబ్బు డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారాగానీ,
మనిఆర్డర్ ద్వారాగానీ
'చందమామ ఇండియా లిమిటెడ్'
పేరిట పంపండి.



వ్యవస్థాపకులు
బి. నాగిరెడ్డి - చక్రపాణి

# ఆదర్శనేత అడుగుజాడలలో...

స్వాతంత్ర్యానంతరం మనదేశం వివిధరంగాలలో గర్వించతగ్గ అభివృద్ధిని సాధించింది. అయితే, ఈ కాలఘట్టంలోనే కొన్ని ఇతరదేశాలు అసమాన స్థైర్యంతో, అత్యంత శ్రమతో సాధించిన ప్రగతితో మనదేశ ప్రగతిని పోల్చి చూసినప్పుడే కొంత నిరుత్సాహం కలుగుతుంది. ఉదాహరణకు జపాను, సర్వనాశనమైన స్థితినుంచి, ఈ అర్థశతాబ్దంలో సాధించిన అభివృద్ధి అద్భుతం! అనితరసాధ్యం!!

అటువంటి దేశాలకు దీటుగా మనదేశం అభివృద్ధి సాధించలేకపోవడానికి కారణం ఏమిటి? అధిక జనాభాతో సతమతమవుతూన్న పెద్దదేశం మనది. అందువల్ల సమస్యలు కూడా జటిలమైనవే. అంతేకాదు; కార్యరంగంలోకి దిగితే మనకు ఎదురు ఉండదు. ఎలాంటి కార్యాన్నయినా సాధించగల సమర్థులం మనం. అయితే, ఆ తరవాత అలసత్వం, నిర్లక్ష్యం మనల్ని ముంచెత్తుతాయి. రాజకీయ అధికారం కోసం కీచులాడుకుంటూ కాలాన్ని దుర్వినియోగం చేసే సంకుచిత మనస్తత్వం మనది. అధికారంలో ఉంటే తప్ప ప్రజాసేవ చేయలేమనే భావం మనలో వేళ్ళూనుకుపోయింది. నిజానికి అధికారం లేకపోయినా మనం అనేకవిధాలుగా దేశసేవ చేయవచ్చు. ప్రజాస్వామ్య విలువలను పరిరక్షించుకుంటూ, అవినీతిని రూపుమాపడానికి సమిష్టిగా పోరాడడం ఈనాటి ప్రతి పౌరుడి ప్రధాన కర్తవ్యం!

ఈ ఆశయసిద్ధికోసం భారతజాతిని నడిపించిన ఆఖరి ఆదర్శనేత శ్రీ జయప్రకాష్ నారాయణ్. అధికారంలో లేకపోయినా, అశేష ప్రజల ఆదరాభిమానాలను పొందవచ్చని నిరూపించిన ఆదర్శనేత ఆయన!

ఆయన శతజయంతి సందర్భంగా ఒకసారి ఆత్మపరిశీలన చేసుకుందాం. మాలిన్యాల నుంచి బయటపడే శక్తి సామర్థ్యాలు భారతజాతికి ఉన్నవని పదేపదే ఉద్ఘాటించిన నేత శ్రీ జయప్రకాష్ నారాయణ్. ప్రశాంతంగా ఆలోచిస్తే, మన హృదయాలలో ఆయన పిలుపు ఇప్పటికీ ప్రతిధ్వనించడం వినవచ్చు. దానిని స్మరించుకుంటూ ఆ ఆఖరి ఆదర్శనేత అడుగుజాడలలో పయనిద్దాం!

Visit us at : http://www.chandamama.org
సంపాదకుడు : విశ్వం



హీరోస్ ఆఫ్ ఇండియా క్విజ్‌లో పాల్గొని ఆకర్షణీయమైన బహుమతులు గెలుచుకోండి!

# హీరోస్ ఆఫ్ ఇండియా - 22

అద్భుతమైన రచనలు చేసిన కొందరు రచయితలు/కవులను గురించి ఇక్కడ ప్రస్తావించాం. వాళ్ళెవరో మీకు తెలుసా?

అన్నీ సరైన సమాధానాలు గల మూడు ఎంట్రీలు సైకిళ్ళను బహుమతులుగా అందుకుంటాయి!*



**1** ఇంగ్లీషులో రచనలు చేసిన భారతీయులలో అగ్రగామిని... కూలీ, అన్ టచబుల్, టు లీవ్స్ అండ్ ఎ బడ్ మొదలైన నవలలు రచించాను. నేనెవరిని?

---

**2** నేనొక హిందీ కవిని. నేను రచించిన వాటిలో సుప్రసిద్ధమైనది 'మధుశాల'. నా పేరేమిటి?

---

**3** నేనొక తమిళ విప్లవ కవిని. సంఘసంస్కరణ కోసం,జాతిని జాగృతం చేయడానికీ ఎక్కువ రచనలు చేశాను. 'కుడుంబ విళక్కు' అన్నది నా రచనలలో ఒకటి. నేనెవరో తెలుసా?

---

**4** నేనొక వంగ రచయితను. చరిత్రహీన్, దేవదాస్ నవలలు రాశాను. నా పేరేమిటి?

---

**5** 1984 లో కయర్ అనే నవలకు జ్ఞానపీఠ పురస్కారం అందుకున్నాను. ఉత్తరోత్తరా సినిమాగా రూపొందిన 'చెమ్మీన్' నవలను కూడా నేనే రచించాను.కేరళరాష్ట్రానికి చెందిన నాపేరేమిటి?

---

ప్రతి ప్రశ్నకు దిగువ చుక్కలతో చూపినచోట మీ సమాధానాలను స్పష్టంగా రాయండి. ఈ ఐదుగురిలో మీకు చాలా ఇష్టమైన రచయిత/కవి ఎవరు? ఎందుకు? అన్న విషయాలను పది పదాలకు మించకుండా రాయండి.

**నా అభిమాన రచయిత/కవి:**

.............................................................

.............................................................

పాల్గొనేవారి పేరు: ..................................................

వయసు:.............తరగతి: ...........................................

చిరునామా:..........................................................

.............................................................

పిన్: ........................ ఫోన్: ........................

పాల్గొనేవారి సంతకం: ......................

తల్లి/తండ్రి సంతకం:......................

వివరాలన్నీ పూర్తిగా నింపాక, ఈ పేజీ కత్తిరించి 2003 ఆగస్టు 5వ తేదీలోగా అందేలా ఈ చిరునామాకు పంపండి:

హీరోస్ ఆఫ్ ఇండియా క్విజ్-22
చందమామ ఇండియా లిమిటెడ్
82, డిఫెన్స్ ఆఫీసర్స్ కాలనీ
ఈకాట్టుత్తాంగల్, చెన్నయ్-600 097.






సూచనలు:

1. 8-14 ఏళ్ళ లోపు వయసు పిల్లలందరూ ఈ పోటీలో పాల్గొనవచ్చు.
2. ఈ పోటీకి వచ్చే అన్నిభాషల ఎంట్రీల నుంచి ముగ్గురు విజేతలు ఎంపిక చేయబడతారు. విజేతలు వారికి తగిన సైజు సైకిళ్ళు అందుకుంటారు. సరైన సమాధానాలుగల ఎంట్రీలు ఒకటికన్నా ఎక్కువ వచ్చినట్లయితే, నా అభిమాన హీరో వివరణ ఆధారంగా విజేతలు ఎంపిక చేయబడతారు.
3. న్యాయనిర్ణేతలదే తుది నిర్ణయం.
4. ఈ విషయంగా ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరుపబడవు.
5. విజేతలకు విషయాన్ని పోస్టుద్వారా తెలియజేస్తాము.

# Junior CHANDAMAMA

**RESERVE YOUR COPY NOW!**




Do you want your children to sharpen their faculties by working on puzzles?
**Come to Junior Chandamama for loads of puzzles and games.**

Are you looking out for interesting new stories to be read out to the kiddies?
**Pick up a copy of Junior Chandamama, and you'll find them there.**

## SPECIAL OFFER

With every one year's subscription get a

**Luxor Junior Crayfun set worth Rs. 45*** absolutely Free! Rush!




**PAGE AFTER PAGE WILL KINDLE YOUR CHILD'S IMAGINATION**

**ISSUE AFTER ISSUE, MONTH AFTER MONTH**

* offer valid upto 30th September, 2003 only.

## SUBSCRIPTION FORM

Please enrol me as a subscriber of Junior Chandamama. I give below the required particulars:

Name : ..........................................

Address : ..........................................

..........................................

..........................................

PIN Code : ..........................................

I am remitting the amount of Rs.120/- for 12 issues by Money Order/Demand Draft/Cheque No..................... on..................................... Bank ..................................... branch drawn in favour of Chandamama India Ltd., encashable at Chennai (outstation cheque to include Rs.25/- towards Bank Commission).

Place : ....................

Date : ....................　　　　Signature

# వెలుగు - నీడ

కోదండరామయ్య పేరు తెలియనివారు, ఆ ఊళ్ళో ఎవరూ వుండరు. ఆయన పేరుమోసిన వస్త్రాల వ్యాపారి. చిన్నతనం నుంచీ వ్యాపారంలో అనుభవం గడించి ఎంతో డబ్బు, కీర్తి ప్రతిష్ఠలను సంపాదించాడు. అంత డబ్బున్నా ఆయన సాధారణ జీవితం గడుపుతూండేవాడు. సాదాసీదా నూలు వస్త్రాలు ధరించేవాడు. అతి సాధారణ భోజనం తీసుకునేవాడు. అలాగని ఆయన పిసినారి కూడా కాదు. ఆపదలో వున్న పేదవాళ్ళకు ధనసహాయం చేస్తూండేవాడు.

కోదండరామయ్య దగ్గర ఎంతోకాలం నుంచి పనిచేస్తూ వస్తున్న రంగయ్య, ఎన్నోసార్లు తన మనసులోని సందేహంకొద్దీ, ''అయ్యా, తమకేం తక్కువ! జీవితం అనుభవించడానికే గదా వున్నది. మీరెందుకు విలాసంగా ఖర్చుపెట్టి ఆనందంగా వుండరు?'' అని అడిగేవాడు.

కానీ కోదండరామయ్య బదులు చెప్పకుండా నవ్వి ఊరుకునేవాడు.

ఇలా వుండగా - అనుకోకుండా ఒకసారి కోదండరామయ్యకు వ్యాపారంలో పెద్ద నష్టం వచ్చింది. ఊహించని ఈ నష్టం కారణంగా ఆయన సర్వస్వం కోల్పోయాడు.

ఈ స్థితిలో తన యజమానిని చూసి, రంగయ్య గుండె చెరువయ్యింది. అతడు, ''అయ్యో, ఎంతో ధనవంతుడిగా బ్రతికిన మీరు, ఇప్పుడు ఒక పేదవాడిలా ఎలా బ్రతక గలరు?'' అన్నాడు ఎంతో విచారంగా.

దానికి కోదండరామయ్య చిరునవ్వు నవ్వి, ''రంగయ్యా, నేను ధనవంతుడిగా ఎప్పుడూ జీవించలేదు. బాగా డబ్బున్నప్పుడు కూడా పేదవాడిలాగానే బ్రతికాను. సుఖం ఒక చుట్టం; కష్టాలే శాశ్వతం. బ్రతుకు వెలుగు - నీడల సమ్మేళనం అన్నది వాస్తవం! డబ్బున్నదికదా అని విలాసవంతంగా బ్రతికితే, అది లేని రోజుల్లో బ్రతుకు నరకప్రాయంగా అనిపిస్తుంది. పరిస్థితి బాగున్నప్పుడు కష్టాలలో వున్నవారికి సాయపడ్డాను. వాళ్ళల్లో కొందరు, నాకిప్పుడు సాయంగా వున్నారు,'' అన్నాడు.

ఆ తర్వాత కొద్దికాలానికే కోదండరామయ్య నష్టాల నుంచి బయటపడి, తిరిగి ఉన్నతస్థాయికి చేరుకున్నాడు.

-కె. చిన్నబాబు





# మాయాసరోవరం

## 18

[బెబ్బులిదొరనూ, గణాచారినీ బంధించి, సిద్ధసాధకుడు, హిరణ్యపుర రాజైన కనకాక్షుణ్ణి చూడబోయాడు. హంసల రథంలో వున్న జయశీలుడికి, అరణ్యంలో ఒకచోట పులిచేత తరమ బడుతున్న కాంచనమాల కనిపించింది. కిందికి వచ్చి అతడామెను రక్షించాడు. ఆ సమయంలో చాటున వుండి మాయాసరోవరేశ్వరుడు, అతడి మీదికి ఉచ్చుతాడు విసిరాడు. తరువాత—]

జయశీలుడు తన మెడను ఉచ్చుతాడు తాకగానే తృటికాలం నివ్వెరపోయి, వెనుదిరిగి చూశాడు. అతడికి జలగ్రహం మీద మాయా సరోవరేశ్వరుడూ, పక్కనే గుర్రం మీద మకర కేతూ కనిపించారు. జయశీలుడు చప్పున తేరుకుని తన కంఠానికి బిగుసుకుపోతున్న తామరకాళ్ళ తాడును కత్తితో నరకబోయిన వాడల్లా ఆగి, సరోవరేశ్వరుడి కేసి తేరిపార చూశాడు. మాయాసరోవరేశ్వరుడు తన చేతిలో వున్న తాటికొసను కొంచెం లాగి, జయ శీలుడితో, "నువ్వేగదా, జయశీలుడనే మహా వీరుడివి! తాడును కత్తితో నరకబోయిన వాడివి, ఎందుకు ఆగావు?" అన్నాడు.

"ఆ, ఇప్పుడు తెలిసింది, నువ్వు మాయా సరోవరేశ్వరుడివన్నమాట! తాడును కంఠానికి ఉచ్చువేసినవాడివి, దాన్ని గట్టిగా బిగించి, నా ప్రాణాలు తీయకుండా ఎందుకు వూరు కున్నావు?" అని అడిగాడు జయశీలుడు.

"నేను ఒక సరోవరానికి రాజును. ఎంత మహాసత్వుడైన మానవుడి ప్రశ్నకైనా నేను జవాబివ్వనవసరం లేదు," అన్నాడు మాయా సరోవరేశ్వరుడు.



జయశీలుడు ఈసారి కోపంగా ఏదో అనబోయేంతలో, అంతవరకూ ఈ జరుగుతున్నదానికి నిర్విణ్ణురాలైపోయి చూస్తున్న కాంచనమాల తెప్పరిల్లి, "మామయ్యా, నువ్వు హంసలరథం లోంచి కిందపడి, ప్రాణాలతో వున్నందుకు చాలా ఆనందంగా వున్నది. కాని నువ్వు జయశీలుడనే ఈ యువకుడికి హాని కలిగించకు. ఈయన నన్ను పులిబారి నుంచి రక్షించాడు," అన్నది.

"అమ్మా, కాంచనా! అదంతా నేను స్వయంగా నా కళ్ళతో చూశాను. ఇతణ్ణి చంపాలని లేదు! ప్రాణాలతో బందీగా మాయాసరోవరానికి తీసుకుపోబోతున్నాను," అన్నాడు మాయాసరోవరేశ్వరుడు.

కాంచనమాల, జయశీలుడికేసి తల తిప్పి, "మామగారు నీకెలాంటి హానీ కలిగించనంటున్నారు గదా! నువ్వు ఇష్టంగానే, ఆయనవెంట మాయాసరోవరానికి ఎందుకు రాకూడదు?" అన్నది.

"కాంచనా, ఇందులో నా ఇష్టాయిష్టాలకు తావెక్కడిది? ఈ సరోవరేశ్వరుడు నన్ను జయించి బందీగా తీసుకుపోతున్నానను కుంటున్నాడు. కావాలంటే ఈ క్షణాన ఒక్క కత్తివేటుతో, నా కంఠానికి చుట్టిన తాడును తెగనరకగలను," అన్నాడు జయశీలుడు.

జయశీలుడు ఇలా అనగానే మాయాసరోవరేశ్వరుడు, తన పక్కన వున్న మకరకేతుతో, "కేతూ, నువ్వు ఈ జయశీలుడు పారిపోకుండా దారి అడ్డగించు. ఈ లోపల నేను ఉరి తాడును కొంచెం బిగలాగి, బలవన్మరణం అంటే ఎలా వుంటుందో, ఇతడికి తెలిసేలా చేస్తాను," అన్నాడు.

మకరకేతు అయిష్టంగా ముఖం పెట్టి, రాజాజ్ఞ గనక చేసేదేమీలేనందున గుర్రాన్ని అదిలించి,జయశీలుడికేసి నడిపాడు. అంతలో కాంచనమాల భయంతో చిన్నగా కేకపెట్టి, జయశీలుడి కంఠాన్నుంచి వేలాడుతున్న తాడును రెండు చేతులతో గట్టిగా పట్టుకుని, "మామయ్యా, ఈ తాడును మరేమాత్రం గట్టిగా లాగి, ఈయన కంఠాన్ని బిగించినా, నేను సహించను. నేనూ, ఈయనతోపాటు ఇదే తాడుతో ఉరిపోసుకుంటాను," అన్నది.

"ఆశ్చర్యం! ఈ కొద్ది క్షణాల్లోనే కథ ఇంత దూరం వచ్చిందన్నమాట!" అంటూ సరోవరేశ్వరుడు ఆశ్చర్యపోయి, అయినా ప్రయత్నించి చూడటంలో తప్పేముంది, అని మనసులో అనుకుని, చప్పున తల ఎత్తి, "జయశీలా, నువ్వన్నట్టు కత్తితో నీ మెడను చుట్టిన తాడును తెగకొట్టగలవేమో కాని, ఈ జలగ్రహాన్నుంచి తప్పించుకుని పారిపోలేవు. అది నిన్ను కాళ్ళతో మట్టగించి, కోరలతో

పొడిచి క్షణాలలో భూస్థాపితం చెయ్యగలదు,'' అన్నాడు.

''ఏదీ ప్రయత్నించి చూడు!'' అంటూ జయశీలుడు కత్తిని పైకెత్తి, తాడును నరక బోయేంతలో మకరకేతు చిన్న గొంతుతో, ''జయశీలా, తొందరపడకు! సరోవరేశ్వరుడు నిన్ను మాయాసరోవరానికి తీసుకుపోదల చటంలో చిన్న రహస్యం వున్నది. పైగా, నువ్వా సరోవరాన్ని చేరాలని ఎలాగూ ప్రయత్నిస్తున్నావు గదా?'' అన్నాడు.

జయశీలుడికి, మకరకేతు మాటలు తన మంచికోరి చెప్పినట్టుగా తోచినై. కనకాక్ష రాజుగారి పిల్లల్లో కాంచనమాల ఒక్కతే దొరికింది; ఆయన కొడుకు కాంచనవర్మ ఇంకా ఆ మాయాసరోవరంలో బందీగానే వున్నాడు. కాని, ఈ కాంచనమాల తనను అపహరించుకుపోయిన మాయాసరోవరే శ్వరుణ్ణి, మామయ్యా, అంటూ ఎంతో గౌర వంగా పిలవటం అతడికెంతో ఆశ్చర్యంతో పాటు, అనుమానం కూడా కలిగించింది...

''సరే, మాయాసరోవరేశ్వరా! నువ్వు నాకన్న బలవంతుడివని తెలిపోయింది, లొంగిపోయాను. ఇప్పుడు నన్నేం చేయబో తున్నావు?'' అని అడిగాడు జయశీలుడు.

''ఈ లొంగిపోయాననటంలో మోసం లేదు గదా?'' అన్నాడు మాయాసరోవరేశ్వరుడు.

''బలదర్పాలు లేనివాడు, మోసాన్ని అడ్డం పెట్టుకుని జీవిస్తాడు. నేనెలాంటివాడినో, ఈ మకరకేతుకు తెలిసివుండాలి, అవునా, మకరకేతూ?'' అన్నాడు జయశీలుడు.

''నేను మహారాజుగారికి లోగడే మనవి చేశాను; నువ్వు సామాన్యుడివి కాదు, మహా



సత్త్వుల కోవకు చెందినవాడివని,'' అన్నాడు మకరకేతు.

''సత్వం ఏపాటిదో సరోవరం చేరింతరవాత చూస్తాను. మనం ఇంతకు ముందే జల వృకుడొకణ్ణి చూశాంగదా, కేతూ! మిగిలిన దుర్మార్గులు అక్కడ ఎలాంటి బీభత్సం చేస్తు న్నారో,'' అంటూ మాయసరోవరేశ్వరుడు పెద్దగా నిట్టూర్చాడు.

''అయితే ఇప్పుడు నా మెడను చుట్టిన, ఈ ఉరితాటి మాటేమిటి?'' అని అడిగాడు జయశీలుడు.

మాయసరోవరేశ్వరుడు జవాబిచ్చే లోపలే కాంచనమాల చిన్నగా నవ్వుతూ, జయ శీలుడి కంఠాన్నుంచి తాటి ఉచ్చును ఊడ దీసి, ''ఇది ఉరితాడు కాదు, మామయ్యా నీ మెడలో వేసిన తామరతూండ్ల హారం!'' అన్నది.

''కథ మెరుపువేగంతో ముగింపుకు వస్తు న్నట్టున్నది. పాపం, పద్మముఖి అన్నిటా దుర



దృష్టవంతురాలే! కనీసం ఇతడు జలవృక రాజును హతం చేయటానికి సాయపడినా, నాకు గొప్ప మేలు జరిగినట్టే,'' అనుకున్నాడు మాయాసరోవరేశ్వరుడు తనలో తాను.

''మహారాజా, ఇప్పుడు ఏం చేయమని ఆజ్ఞ?'' అని అడిగాడు మకరకేతు.

''అందరం సరోవరానికి పోతున్నాం. ముందుండి దారి తియ్యి,'' అన్నాడు మాయా సరోవరేశ్వరుడు.

''జయశీలుడు కాలినడకన మనను అనుసరించి రాగలడా?'' అంటూ మకర కేతు, జయశీలుడికేసి చూశాడు.

''కాంచన నాతోపాటు జలగ్రహం మీద వస్తుంది. నువ్వూ, జయశీలుడూ గుర్రం మీద బయలుదేరండి,'' అన్నాడు మాయా సరోవరేశ్వరుడు.

కాంచనమాల కూడా తిరిగి మాయాసరో వరానికి తీసుకుపోబడుతున్నదని వింటూనే జయశీలుడు గతుక్కుమని, మకరకేతుతో, ''కేతూ, కాంచనమాలను తిరిగి మాయా సరోవరానికి తీసుకుపోయేందుకు నేనొ ప్పను. కనకాక్షరాజుగారికి, అపహరించుకు పోబడ్డ పిల్లలిద్దర్నీ తెచ్చి ఒప్పచెపుతానని వాగ్దానం చేశాను. దొరికిన ఈవిణ్ణి మళ్ళీ నిర్బంధానికి గురిచేసేందుకు వీల్లేదు,'' అన్నాడు.

మాయాసరోవరేశ్వరుడు కోపంగా జయ శీలుడికేసి చూశాడు. కాంచనమాల కూడా అతడికేసి కోపంగా చూస్తూ, ''నేనూ, మా అన్న కాంచనవర్మా అరణ్యంలో నుంచి అపహ రించుకుపోబడిన మాట నిజమేగాని, ఎవరి నిర్బంధంలో మాత్రం లేము. అన్న వెంట లేకుండా నేను ఒక్కదాన్నే, నా తలిదండ్రుల వద్దకు ఎలా వెళ్ళేది? చేతనైతే, నా అన్నను కూడా నువ్వే నిర్బంధాన్నుంచి విముక్తుణ్ణి చెయ్యి,'' అంటూ చకచకా జలగ్రహం దగ్గిరకు పోయి, మాయాసరోవరేశ్వరుడు అందించిన చేయి ఆధారంతో, దానిమీద ఎక్కి కూర్చున్నది.

''కేతూ, అంతా చిత్రంగా వున్నది! రాజు గారిపిల్లలు అపహరించబడటం, మాయా సరోవరం – అంతా అబద్ధం కాదుగదా?'' అన్నాడు జయశీలుడు ఆశ్చర్యపోతూ.

''ముందు వచ్చి గుర్రం మీద కూర్చో. సరోవరం చేరాక, సంగతి సందర్భాలన్నీ నువ్వే గ్రహించగలవు,'' అన్నాడు మకరకేతు.

జయశీలుడు మారుమాట్లాడకుండా పోయి, మకరకేతు వెనక గుర్రం మీద కూర్చు న్నాడు. మాయాసరోవరేశ్వరుడు జలగ్రహాన్ని అదిలించాడు. అది కదిలి వేగంగా నడవసా గింది. దానిని అనుసరించి మకరకేతు గుర్రాన్ని

పరిగెత్తించసాగాడు. జయశీలుడికి ఆ సమయంలో సిద్ధసాధకుడు చెప్పిన జ్ఞాపకం వచ్చాడు. ఎంతోకాలంగా అరణ్యాల్లో తనతో పాటు కష్టాలనుభవించిన సాధకుడు, తాను కనిపించకపోయేసరికి, ఏమనుకుంటాడు? తను మరణించాడని భావించడు గదా? హంసలరథంలో వున్న తన బాల్యమిత్రుడు దేవశర్మ; తాను, కాంచనమాలను రక్షించబోయి, పులివాతబడినట్టు శంకించటం జరిగితే!

జయశీలుడు ఇలాంటి ఆలోచనల్లో మునిగివున్న సమయంలోనే, అశ్వికుల నాయకుడు వీరసేనుడు, సిద్ధసాధకుణ్ణి అరణ్యంలో కనకాక్షరాజు విడిదిచేసి వున్న చోటుకు తీసుకుపోయాడు. రాజు అతణ్ణి గుర్తించి, ఆప్యాయంగా పలకరించి, "నీతో పాటు, నా పిల్లలను వెతికి తెచ్చేందుకు బయలుదేరిన జయశీలుడనే యువకు డెక్కడ? మీరెన్నాళ్ళకూ తిరిగి రాకపోయేసరికి రాజ్యాన్ని మంత్రులకు అప్పగించి, నేనే స్వయంగా బయలుదేరి, ఈ అరణ్యాలన్నీ గాలిస్తున్నాను," అన్నాడు.

"మహారాజా, యువరాజునూ, యువ రాణినీ ఎత్తుకుపోయినవాళ్ళు మాయాసరోవరం అనేచోట నివసించే వింత మనుషులు. వాళ్ళు, నీళ్ళల్లోనూ, నీళ్ళ బయటా కూడా మామూలుగానే జీవించగలరు. వాళ్ళల్లో కొందరిని పట్టుకున్నాం. వాళ్ళ రాజైన మాయా సరోవరేశ్వరుడనేవాడు ముందు నరభక్షకులకు దొరికి, తరవాత నాచేత చిక్కి, తప్పించుకుపోయాడు. అయినా మునిగిపోయిందేమీలేదు. అదే మాయాసరోవరంలో మరొక ప్రాంతాన బతికే ఈ జలవృకరాక్షసుడు నాకు



బంటు అయ్యాడు. ఈ రాక్షసుడి ద్వారా మనం ఆ సరోవరం ఎక్కడ వున్నదో, తెలుసుకోవచ్చు," అన్నాడు.

"అలాగా!" అంటూ కనకాక్షరాజు, రాతి గదను భుజం మీద పెట్టుకుని, సిద్ధసాధకుడి వెనకగా నిలబడిన జలవృకుడికేసి చూసి, "వీడు, నీకు బంటు కాదగినవాడే! మరి, ఆ జయశీలుడేమయ్యాడు?" అని అడిగాడు.

"అతడు, ఇద్దరు మాయాసరోవరం రాజ సేవకులతో కలిసి హంసల రథంలో, ఆ రాజు కోసం అరణ్యంలో గాలిస్తున్నాడు. ఆ రాజు నా కంటబడి పారిపోయినసంగతి అతడికి ఇంకా తెలియదు," అన్నాడు సిద్ధసాధకుడు.

"హంసల రథమా?" అంటూ రాజు కనకాక్షుడితో పాటు, అతడి ఉద్యోగులంతా ఎక్కడలేని ఆశ్చర్యం పొందారు.

"ఒక్క హంసలరథం ఏమిటి, మహారాజా? ఈ జలరాక్షసుడేమిటి? ఈ నరవానరం ఏమిటి? ఇంకా–మూడడుగుల ఎత్తయినా

లేని మనుషులు, ప్రాణులను పట్టి తినే వృక్షాలు—ఇలా, ఒకసారి అరణ్యాల్లో ప్రవేశిస్తే, మనకెదురయ్యేవి వింతలు తప్ప మరేం వుండవు,'' అన్నాడు సిద్ధసాధకుడు.

అంతలో కొంచెం దూరంగా వున్న చెట్ల కింద కలకలం బయలుదేరింది. అక్కడ వున్న రాజభటులతో ఇద్దరు నరభక్షకులు వాదులాడుతున్నారు. తమకొక గొప్ప రహస్యం తెలుసుననీ, అది చెప్పేందుకు తమను నరవానరాన్ని ఎక్కి తిరిగే భూతాలరాయుడి వద్దకు తీసుకుపొమ్మనీ అడుగుతున్నారు.

భటులు వాళ్ళను, ''మీరెవరు? ఎక్కణ్ణించి వచ్చారు?'' అని ప్రశ్నిస్తున్నారు.

సిద్ధసాధకుడు ఒక రాజభటుణ్ణి పంపి, వాళ్ళనిద్దర్నీ తన దగ్గిరకు తీసుకురమ్మన్నాడు. నరభక్షకులిద్దరూ వస్తూనే సాధకుడికి ప్రాణాచారంపడి లేచి, ''దొరా, మా నాయకుణ్ణీ, గణాచారినీ విడిపిస్తే, మీకు గొప్ప రహస్యం చెపుతాం,'' అన్నారు.

సాధకుడికి వాళ్ళేదో ముఖ్యమైన సంగతి తెలుసుకుని వచ్చారన్న అనుమానం కలిగి, జలవృకభటుడికి, గుర్రాలకు కట్టివున్న నరభక్షకుల్ని విడిపించి తెమ్మని ఆజ్ఞ ఇచ్చాడు. వాడు పోయి, బెబ్బులిదొరా, ముసలి గణాచార్ల కట్టుతాళ్ళు విప్పి, ఇద్దర్నీ చెరొక చేత్తో ఎత్తి పట్టుకు తెచ్చి, సాధకుడి ముందు నిలబెట్టాడు.

''ఇప్పుడు చెప్పండి, మీకు తెలిసిన రహస్యం ఏమిటి?'' అని అడిగాడు సిద్ధసాధకుడు, నరభక్షకులను.

''భూతాల దొరా, మీ నుంచి పారిపోయిన మొసలి ముఖంవాణ్ణీ, వింత ఏనుగునెక్కి వచ్చినవాణ్ణీ పట్టుకు తినేందుకు అరణ్యంలో వెతుకుతూండగా, వాళ్ళకు మీలాంటి మనిషీ, మరొక ఆడపిల్లా తటస్థపడ్డారు. మేము వాళ్ళందర్నీ మీదపడి పట్టుకోవటం ప్రమాదమేమో అని సంశయిస్తూ, చెట్లచాటున పొంచి వుండగా, వింత ఏనుగువాడూ, మొసలి ముఖంవాడూ వాళ్ళను తమ వాహనాలమీద ఎక్కించుకుని, కొండలకేసి దౌడు తీశారు. ఇంకో రహస్యం ఏమంటే; హంసలరథంలో నుంచి నేలదిగినకొందరు మనుషులు, తూర్పు దిక్కున ఇక్కడికి ఒక ఆమడ దూరంలో, మధ్య మధ్య కేకలుపెడుతూ, ఎవరికోసమో చెట్టూ పుట్టలూ గాలిస్తున్నారు,'' అన్నారు నరభక్షకులు. —( ఇంకావుంది)



బేతాళ కథలు

# విద్యావంతుడు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజానవేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, అత్యంత దుర్భరమైన శ్రమలకోరుస్తూ, అర్ధరాత్రివేళ ఈ శ్మశానంలో ఏమి సాధించగోరి ఇంత పట్టుదలతో తిరుగుతున్నావో అర్థంకావడం లేదు. ఒకవేళ నువ్వు, ఎలాంటి క్రమశిక్షణా, గురువులకు శుశ్రూషలూ చేసి వారినుంచి విద్యలు నేర్చే ఓర్పూ లేకుండానే, జన్మతః అబ్బిన బుద్ధికౌశలత్వంతో విద్యావంతుడివైనా, గోవిందుడనేవాడిలా గడ్డుసమస్య ఏదైనా ఎదురయినప్పుడు



అసందర్భంగా ప్రవర్తించే ప్రమాదం వున్నది. ఈ విషయంలో నీకు ముందే తగు హెచ్చరి కగావుండేందుకు, ఆ గోవిందుడి కథ చెబు తాను, శ్రమతెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

గోదావరి తీరానగల కపిలపురం అనే ఊళ్ళో గోవిందుడనేవాడుండేవాడు. వాడు చాలా చురుకైనవాడు. ఎంత కష్టమైన విద్య నైనా ఇట్టే నేర్చుకోగలడని అంతా అనుకునే వారు. వాడు ఆగకుండా క్రోసెడు దూరం పరుగున వెళ్ళి రాగలడు. గురి తప్పకుండా చిటారుకొమ్మన వున్న మామిడికాయను బాణంతో కొట్టగలడు. ఎలాంటి బరువుల నైనాసునాయాసంగా ఎత్తగలడు. వాడు, వరదనీటి వెల్లువలో వున్న నదిలో ఈత కొడతాడు. కుస్తీలు పడతాడు. ఇన్నీ చేస్తూ, తండ్రికి వ్యవసాయ పనుల్లోనూ, తల్లికి ఇంటి పనుల్లోనూ సాయం చేస్తూంటాడు.

''కుర్రవాడు చాలా చురుకైనవాడు. రాజ వరంలోని రాజేశ్వరుడి వద్దకు పంపిస్తే, వాడి తెలివి ఇంకా రాణిస్తుంది!'' అని కొందరు ఊరి పెద్దలు గోవిందుడి తండ్రికి సలహా ఇచ్చారు.

''రాజశేఖరుడెవరు?'' అని గోవిందుడు తండ్రిని అడిగాడు.

''రాజశేఖరుడికి రాని విద్యలేదు. ఆయన మహాపండితుడు. ఆయన వద్ద శిష్యరికం చేసినవాడు రాజ్యాలేలగలడని అంతా అంటారు,'' అన్నాడు గోవిందుడి తండ్రి.

దానికిగోవిందుడు నిరసనగా, ''అలాంట ప్పుడు రాజ్యాలేవో తనే ఏలొచ్చుగా, ఆ రాజ శేఖరుడు!'' అన్నాడు.

''అలా వేళాకోళంగా మాట్లాడకు. రాజ్యా లేలడం గొప్ప అని అనుకుని వుంటే, రాజశే ఖరుడెప్పుడో రాజ్యాలేలి వుండేవాడు. ఆయన తను నేర్చుకున్నది పదిమందికీ నేర్పుతూ, ఎప్పటికప్పుడు కొత్తవి నేర్చుకుంటూ, రాజ శేఖరుడికి సాటిరాజశేఖరుడు మాత్రమేనని గొప్ప పేరు తెచ్చుకున్నాడు. నువ్వు కొంతకాలం ఆయనవద్ద శిష్యరికం చేయడం అన్నివిధాలా మంచిదని, నా అభిప్రాయం,'' అన్నాడు గోవిందుడి తండ్రి.

గోవిందుడికి తండ్రి మాటలు నచ్చలేదు. ''జీవితం కొత్త విద్యలు నేర్చుకునేందుకేనా! హాయిగా రోజులు వెళ్ళిపోవడానికి డబ్బు సంపాదించాలి. ఉన్నంతలో నలుగురికీ సాయపడాలి. జీవితమంతా కొత్త విద్యలు నేర్చుకుంటూ గడిపివేయడం, నాకిష్టముం డదు,'' అన్నాడు వాడు తండ్రితో.

''నేర్చుకోగల సత్తా వున్నవాడు, జీవిత మంతా నేర్చుకుంటూ వున్నా అందులో

తప్పులేదు. నీకు సత్తా వున్నదీ లేనిదీ నువ్వే నిర్ణయించుకో!'' అని మాత్రం వాడికి చెప్పి తండ్రి వూరుకున్నాడు.

గోవిందుడికి ఉక్రోషం, పౌరుషం, పట్టుదల అన్నీ ఒకేసారి వచ్చాయి. ఏవిధంగానూ తను రాజశేఖరుడికి తీసిపోనని వాడి నమ్మకం. అలాంటప్పుడు తను, రాజశేఖరుడికి శిష్యరికమెందుకు చేయాలి?

తన ఊరివాళ్ళు తన గొప్పతనాన్ని గ్రహించాలంటే, రాజశేఖరుడికి రాని విద్య తను నేర్చుకోవాలని, గోవిందుడనుకున్నాడు. అయితే, ఆయనకు రాని విద్య లేదంటున్నారు కాబట్టి, తను కొత్తగా ఏదైనా కనిపెట్టాలి! ఈ ఉద్దేశ్యంతో వాడు రోజూ తన పరిసరాలను శ్రద్ధగా గమనించసాగాడు. రాత్రింబవళ్ళు అదే ఆలోచనతో గడపసాగాడు. అలాంటి సమయంలో ఒక రోజున ఒక చిత్రం జరిగింది.

గోవిందుడి కుటుంబానికి ఊరి సమీపంలో చక్కటి మామిడితోట వుంది. ఆ మామిడితోట మధ్యలో అచ్చం మామిడిచెట్టు లాగేవుండే, ఒక చెట్టు వుంది. దాని కాయలు మాత్రం చూడ్డానికి రేగికాయల్లాగానూ, తినడానికి కాకరకాయల్లాగానూ వుంటాయి. ఆ తోటకు చెట్టు అచ్చివచ్చిందని, పూర్వీకులు అలాగే ఉంచేశారు.

ఆ రోజు గోవిందుడు చూస్తూండగా, మామిడితోటలోకి ఒక కోతి ప్రవేశించింది. గోవిందుడది గమనించి కాపలావాళ్ళను హెచ్చరించి, తను కోతిని తరిమాడు. కోతి తోట మధ్యలోని చెట్టుదాకా వచ్చి ఆయాసంతో రొప్పుతూ ఆగింది. తర్వాత, ఆ చెట్టుకాయనొకటి తింది. అంతే! రెట్టించిన ఉత్సాహంతో అది అక్కణ్ణించి తోట అవతలకు ఒక్క ఊపులో లఘించి పారిపోయింది. కాపలావాళ్ళం





దరూ లెంపలు వేసుకుని మనసులోనే, ఆ కోతిని ఆంజనేయస్వామిగా భావించి దణ్ణం పెట్టుకున్నారు.

గోవిందుడు మాత్రం తార్కికంగా ఆలోచించి, ఆ చెట్టు కాయలో ఏదో మహిమ వున్న దనుకున్నాడు. చేదుగా వున్నప్పటికీ ఆ చెట్టు కాయనొకదాన్ని వాడూ తిని గెంతడానికి ప్రయత్నించాడు. తనలో కొంత కొత్తశక్తి వచ్చినట్లు అనిపించినప్పటికీ, ఎక్కువ ఎత్తు ఎగరలేకపోయాడు.అయినా, నిరుత్సాహ పడకుండా మరికొంతసేపు ప్రయత్నించే సరికి, వాడికి ఆయాసం వచ్చింది.

గోవిందుడికి హఠాత్తుగా, కోతి ఆయాస పడిన సమయంలో, ఆ చెట్టుకాయ తిని చాలాదూరం లంఘించి పారిపోయిందన్న సంగతి గుర్తుకొచ్చింది. వెంటనే చెట్టునుంచి మరొక కాయ కోసి తిన్నాడు. ఆ మరుక్షణం వాడికి శరీరం చాలా తేలికైపోయినట్టనిపించింది. ప్రయత్నిస్తే, గాలిలో అదివరకెన్నడూ లేవలేనంత ఎత్తుకు ఎగిరాడు. దూకడానికి ప్రయత్నిస్తే, అంతకుముందెన్నడూ దూకలేనంత దూరం దూకాడు.

అప్పుడు గోవిందుడిక్కలిగిన ఆనంద మంతా ఇంతా కాదు. మనిషి, కోతిని మించి దూకగల కొత్తవిద్య వాడికి తెలిసింది. బహుశా, రామాయణకాలంలో ఆంజనేయుడిటువంటి ఫలాన్నే తిని సముద్రాన్ని దాటాడేమోనని, వాడనుకున్నాడు.

గోవిందుడు తను నేర్చుకున్న విద్యను ఊళ్ళో ప్రదర్శించసాగాడు. తన తోటలోని చెట్టుకాయ గురించి వాడెవరికీ చెప్పలేదు. వాడు చాలాఎత్తు గాల్లోకి ఎగరడం, కుప్పించి ఎంతోదూరం ముందుకు దూకడం చూసి జనం సంతోషంతో చప్పట్లు కొట్టేవారు. ఊళ్ళో వాడికి ఎంతో పేరు రావడమేకాక, దూర ప్రాంతాలనుంచి కూడా వాడి అద్భుత ప్రదర్శన చూడడానికి తండోపతండాలుగా జనం వస్తూండేవారు.

ఒకనాడు గోవిందుడు తండ్రితో, ''నేను కావాలని పరిసరాలను గమనిస్తూ అతి తక్కువ కాలంలో, ఈ కొత్త విద్యను నేర్చుకున్నాను. ఈ విద్య మీరనే ఆ రాజశేఖరుడికి తెలుసునని, నే ననుకోను. ఇక నన్ను ఆ రాజశేఖరుడి వద్ద శిష్యరికం చేయమని చిన్నబుచ్చవద్దు!'' అని చెప్పాడు.

తాను కొత్త విద్య నేర్చుకున్నానన్న భావం కంటే, రాజశేఖరుడికి రాని విద్యను అభ్యసించినందుకు ఎక్కువగా మురిసిపోతున్న గోవిందుణ్ణి, ఒకరోజునొక పెద్దమనిషి వచ్చి, గోవిందుణ్ణి గురించి అడిగాడు.

గోవిందుడాయనకు తనను తాను పరిచయంచేసుకుని, "అయ్యా! తమరెవరు?" అని అడిగాడు.

"నన్ను రాజశేఖరుడంటారు. నువ్వు ప్రదర్శిస్తున్న కొత్త విద్య గురించి విని, అది నేర్చుకునేందుకు, నీ వద్ద శిష్యరికం చేయడానికి వచ్చాను," అన్నాడా పెద్దమనిషి.

గోవిందుడు తడబడుతూ, "తమరు రాజశేఖరుడా! తమకు రాని విద్యలేదంటారు. ఈ ఒక్క విద్యకోసం వెతుక్కుంటూ నావద్దకు వచ్చారా! ఎన్నో విద్యలు నేర్చిన తమకింకా కొత్త విద్యలెందుకు? తమకు రానివిద్య ఉండకూడదన్న అహంభావమా!" అన్నాడు.

"నాయనా! నాకేగనక అహం వుంటే నీ వద్దకు శిష్యరికం చేయడానికి వచ్చేవాడినే కాను," అన్నాడు రాజశేఖరుడు.

ఆ జవాబుకు అయిష్టంగా గోవిందుడు, "అలాంటప్పుడు, ఈ కొత్త విద్య నేర్చుకోవలసినఅవసరం మీకేమిటి? మీరు కూడా వినోద ప్రదర్శనలిచ్చి డబ్బు సంపాదించాలనుకుంటున్నారా?" అన్నాడు గోవిందుడు.

"విద్యావంతుడికి ధనసంపాదనపై వ్యామోహంవుండరాదు. నేను విద్యలు నేర్చినది నా కోసం కాదు. నా జ్ఞానాన్ని భావితరాలవారికి పంచి పెట్టాలని అన్ని విద్యలనూ గ్రంథస్థం చేస్తున్నాను. ఆ విధంగా మన జ్ఞానం మనతోనే అంతరించిపోకుండా జాగ్రత్తపడుతున్నాను," అన్నాడు రాజశేఖరుడు.

దీనికి గోవిందుడు హేళనగా నవ్వి, "అయ్యా! మనిషిని కోతిలా గెంతేలా చేయగల నా విద్య నాతోనే అంతరించిపోతే ప్రపంచానికి ఏమైనా నష్టమున్నదా?" అని అడిగాడు.



"ఉంది నాయనా!" అన్నాడు రాజశేఖరుడు. "చేప నీటిలో ఈదుతుంది; భూమ్మీద విలవిలలాడుతూ ప్రాణాలు విడుస్తుంది. హిమాలయాల్లోని ఎలుగుబంటి, ఎడారిలో క్షణకాలం వుండలేదు. మనిషి అలాకాదు. అతడు నీటిలో ఈదాలి. గాలిలో ఎగరాలి. అన్ని వాతావరణ బీభత్సాలనూ తట్టుకోవాలి. అందుకు తగినవిధంగా దేవుడు, మనిషికి మెదడునిచ్చాడు. ఇప్పుడు నీవు నేర్చిన విద్య విషయమే తీసుకుంటే - దాని సాయంతో ఏరు దాటవచ్చు. చిక్కుకున్న మంటల్లోంచి బయటపడవచ్చు. ఏ విద్యకైనా ఎన్నో ప్రయోజనాలుంటాయి. అవసరాన్నిబట్టి మనుషులు ఉపయోగించుకుంటారు. విద్యలను గ్రంథస్థంచేస్తూ ప్రచారం చేయడం విద్యావంతుల కర్తవ్యం!"

రాజశేఖరుడు ఇలా చెప్పగానే, గోవిందుడు, ఆయనకు రెండుచేతులూ జోడించి

నమస్కరించి, "నన్ను మన్నించండి! నేను మీతో వచ్చి, మీకు శిష్యరికం చేసి నా అవగాహనను పెంచుకుంటాను. ఆ తరవాత నాకు తెలిసిన విద్యను తమకు గురుదక్షిణగా సమర్పించుకుంటాను. నన్ను తమ శిష్యుడిగా స్వీకరించి, నాకాభాగ్యం కల్పించండి," అన్నాడు వినయంగా.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, గోవిందుడు, ఏ గురువుకూ శిష్యరికం, శుశ్రూషలూ చేయకుండానే తన ప్రజ్ఞా, ఇంగితజ్ఞానాలతో అరుదైన గొప్ప విద్యను సాధించాడు. ఆ విద్యకు వున్న అపురూపమైన ప్రాశస్త్యాన్ని గురించి రాజశేఖరుడు చెప్పిన తర్వాత కూడా అతడు తనకున్న ప్రత్యేకతను మరిచి, ఆయనను మన్నించమని అర్థించడం శిష్యుడిగా స్వీకరించమని ప్రార్థించడం అనాలోచితంగానూ, అసందర్భంగానూ లేదా? తను నేర్చిన కొత్త విద్యద్వారా, తను రాజశేఖరుడికి సాటిరాగల విద్యావంతుణ్ణని నలుగురిలో నిరూపించుకునే అవకాశం వుండీ, దాన్ని చేజేతులా జారవిడుచుకోవడం అజ్ఞానం గదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "గోవిందుడు అహంకారి అనేది, అతడు మొదట్లో తండ్రి చెప్పినదానికి ఇచ్చిన జవాబులద్వారా, తర్వాత రాజశేఖరుడి పట్ల ప్రవర్తించిన తీరువల్లా తెలుస్తూనే వున్నది. కానీ వాడు తన ప్రశ్నలకు, రాజశేఖరుడిచ్చిన జవాబులు విన్నతర్వాత, తాను కేవలం ఏదో ఒక కొత్తవిద్యను నేర్చిన విద్యావంతుణ్ణి మాత్రమే అని గ్రహించాడు. వాడు వస్తుతః చురుకైనవాడు; కొంత తార్కికంగా ఆలోచించగల మేధాశక్తిగలవాడు. అందువల్లనే, తనలో అహంకారంపాలెక్కువనీ, తనకు తెలిసిన విద్యే సర్వం అనుకుంటున్నాననీ గ్రహించాడు. రాజశేఖరుడు అలాకాక, విద్యావంతుల, పండితుల స్థాయి నుంచి, ఆ పైమెట్టయిన జ్ఞాని, యోగులస్థాయికి ఎదిగినవాడు! ఇది గుర్తించిన గోవిందుడు, రాజశేఖరుణ్ణి, తనను మన్నించవలసిందిగా అర్థించాడు. ఇందులో అసందర్భ ప్రవర్తనగానీ, అజ్ఞానంగానీ ఏమీ లేదు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. -(కల్పితం)

[ఆధారం: "వసుంధర" రచన]



# అదీ సంగతి!

లక్ష్మీపతి, గౌరీపతి ఇరుగుపొరుగు గృహస్తులు. లక్ష్మీపతి శ్రీమంతుడు. ఏ చీకూ చింతా లేకుండా హాయిగా సాగే జీవితం అతనిది. గౌరీపతి పరిస్థితి ఇందుకు పూర్తిగా భిన్నమైనది. అతడిది కుచేల సంసారం. పైగా, ఎప్పుడూ అనారోగ్యంతో బాధపడుతూంటాడు. కాని, ఎన్ని ఇబ్బందులున్నా, అప్పో సొప్పో చేసి తన పుట్టినరోజును మాత్రం సంతోషంగా జరుపుకుంటాడు. తెలిసినవాళ్ళందరికీ ఆ రోజున స్వయంగా మిఠాయికూడా పంచి పెడతాడు.

ఒకసారి గౌరీపతి, తన పుట్టినరోజున మిఠాయిలు పంచుతూండగా, అతడున్న వీధిలోనే ఉండే రామరాజు ఎదురుపడి, "గౌరీపతీ, నాదొక చిన్న సందేహం. అడిగితే ఏం అనుకోవుగదా?" అన్నాడు.

"అడగండి!" అన్నాడు గౌరీపతి.

"మీ పొరుగింటి లక్ష్మీపతికి ఆరోగ్యం, ఐశ్వర్యం రెండూ వున్నాయి. అయినా, ఆయన ఎన్నడూ తన పుట్టినరోజును జరుపుకున్నట్లు, నే వినలేదు. మరి నీదేమో ఒక రకంగా కష్టమయ జీవితం. అయినా, ఏమరకుండా ప్రతి సంవత్సరం పుట్టినరోజును సంతోషంగా జరుపుకుంటావు. ఇది నాకు చాలా విడ్డూరంగా వుంది," అన్నాడు రామరాజు.

ఆ ప్రశ్నకు గౌరీపతి చిన్నగా నవ్వి, "ఇందులో విడ్డూరం ఏముంది! హాయిగా సాగిపోతున్న తన జీవితంలో ఒక సంవత్సరం తగ్గిపోయింది కదా అన్న విచారంతో, లక్ష్మీపతి తన పుట్టినరోజు జరుపుకోడు. ఇక నేనో - బాధలు నిండిన బతుకులో, ఒక సంవత్సరం తగ్గిందికదా అనే ఆనందంతో, పుట్టినరోజు పండుగ చేసుకుంటాను, అదీ సంగతి!" అన్నాడు. -జి.సి.జీవి



# తెలివిమీరిన యాత్రికుడు!

సాధుబాబా అనే ఒక సన్యాసి తీర్థయాత్రలు చేస్తూ, పుణ్యక్షేత్రాలు దర్శిస్తూ ఎల్లప్పుడూ దేశాటనలోనే ఉండేవాడు. మార్గమధ్యంలోని ఒక్కొక్క గ్రామంలోనూ, పట్టణంలోనూ ఒకటి రెండు రోజులకు మించి ఆగేవాడు కాదు. సన్యాసిగనక ఆయన వద్ద ఒక జత బట్టలు, కంచుపాత్ర తప్ప వేరేదీ లేదు. ఆ రెంటినీ ఒక జోలెలో వేసుకుని, భుజానికి తగిలించుకుని వెళుతూండేవాడు. ఆయన బసచేసిన చోట భక్తులు ప్రీతితో భోజనం పెట్టేవారు.

ఒక్కొక్కసారి సాధుబాబా వెంట శిష్యుల్లా ఒకరిద్దరు యాత్రికులు వెళ్ళేవారు. సాధుబాబాలాంటి పుణ్యపురుషుడితో కలిసి తీర్థయాత్ర చేసి వస్తే మరింత పుణ్యం లభిస్తుందని వాళ్ళ నమ్మకం. బాబా దారిపొడవునా, మంచి మంచి కథలు చెప్పడంవల్ల నడిచేప్పుడు వాళ్ళకు అలసట కూడా తెలిసేది కాదు. పైగా ఏ ఊరికి వెళ్ళినా బాబాతోపాటు భక్తుల ఇళ్ళల్లో తమకూ మంచి భోజనం ఉచితంగా లభిస్తుందని కూడా ఆయన వెంట కొందరు యాత్రలకు బయలుదేరేవారు.

ఆ విధంగా సాధుబాబా ఒకసారి ఇద్దరు యాత్రికులతో కలిసి శ్యాంపూర్‌కు వచ్చాడు. ఆ ఊళ్ళో లాలూసేఠ్ అనే ఒక ధనిక వర్తకుడు ఉన్నాడు. ఆయన వడ్డీవ్యాపారం కూడా చేస్తాడు. పిల్లికి బిచ్చం పెట్టని పరమపిసినారి అనీ, దురాశ పరుడనీ సేఠ్ పేరుపడ్డాడు. ఆ ఊరొచ్చిన సాధుబాబా ఒకటి రెండు రోజుల్లో జగన్నాథమందిరం వెలసిన పూరీకి బయలుదేరుతున్నాడని తెలియగానే, లాలూసేఠ్ తానూ ఆయనతోపాటు వెళ్ళాలనుకున్నాడు.

''ఇప్పుడే తీర్థయాత్రకు వెళ్ళవలసిన తొందర ఏమిటి? అవన్నీ నెమ్మదిగా వృద్ధాప్యంలో చూసుకోవచ్చు కదా. నువ్వు ఎప్పటిలా వ్యాపారాలను అభివృద్ధిచేసే వ్యవహారాలపై దృష్టి పెట్టు,'' అన్నాడు సాధుబాబా.



"నాకు రాలేదుకానీ, వృద్ధాప్యం తమకు వచ్చేసింది కదా? తమవంటి పుణ్యాత్ములతో కలిసి వెళితేనే నాకు తీర్థయాత్రలు చేసిన పుణ్యం పరిపూర్ణంగా లభిస్తుంది. తమ సాహచర్యం నాకు ప్రధానం. అది లేకుంటే ఎన్ని సంపదలున్నా ఏమిటి ప్రయోజనం?" అన్నాడు సేఠ్.

బాబాకు మనుషుల మనస్తత్వం బాగా తెలుసు. సేఠ్‌కు చేసిన పాపాలను తీర్థయాత్రల ద్వారా ప్రక్షాళనం చేసుకుని పుణ్యం సంపాయించాలని ఉంది. అయితే, అందుకు దమ్మిడీ ఖర్చు కాకూడదు. బాబా వెంట వెళితే దారిలో తిండిఖర్చులుండవు. అంతా ఆయన భక్తులే చూసుకుంటారు. అదీ సేఠ్ ఎత్తుగడ అని బాబా గ్రహించాడు.

అయినా బాబా, "కేవలం తీర్థయాత్రలు చేయడం వల్లా, పుణ్యస్థలాలు దర్శించడం వల్లా ఎలాంటి ప్రయోజనమూ ఉండదు, నాయనా. అందుకు మనిషి ప్రాపంచిక బంధాలను తెంచుకోవాలి. యాత్రాసమయంలో లాభనష్టాలను గురించి ఆలోచించకూడదు. ఎలాంటి ఐహిక చింతలూ, విచారాలూ లేకుండా నువ్వు నిర్మల చిత్తంతో, దైవచింతనతో యాత్ర చేయగలనని అనుకుంటున్నావా?" అని అడిగాడు.

"బాబా, ఈ ఒక్క నెలరోజుల పాటు నేను ఇంటిపట్టున లేకుంటే నా భార్యా పిల్లలు ఇంటి వ్యవహారాలను ఎలా నెట్టుకు రాగలరో చూడాలని ఉంది," అన్నాడు సేఠ్ తల పంకిస్తూ.

"అంటే, ఈ ఒక్క యాత్రద్వారా బహుళ ప్రయోజనాలను సాధించాలనుకుంటున్నావు, అంతే కదా," అంటూ సాధువు మందహాసం చేసి ఊరుకున్నాడు.

సేఠ్ మరిద్దరితో కలిసి బాబా వెంట తీర్థ యాత్రకు బయలుదేరాడు. అతడు తెచ్చుకున్న మూటను కూడా, పెద్దమనిషి అనే గౌరవం కొద్దీ మిగిలిన ఇద్దరు యాత్రికులు మోసుకు రావడం



వల్ల, సేఠ్ చేతులూపుకుంటూ హాయిగా నడవసాగాడు.

మార్గమధ్యంలో ఏ ఊళ్ళోనో ఆగి భోజనం చేసి విశ్రాంతి తీసుకుంటున్నప్పుడు, సేఠ్ గుట్టు చప్పుడు కాకుండా పక్కనున్న అంగడి వీధిలోకి వెళ్ళి అక్కడ సరుకుల ధరలను తెలుసుకుని వచ్చేవాడు. ఆ ధరలను తమ గ్రామంలో అమ్మే వస్తువుల ధరలతో పోల్చుకునేవాడు. నడిచి వెళ్ళేప్పుడు దారిలో బాబా చెప్పే నీతి కథలనూ, వేదాంత విషయాలనూ అసలు వినేవాడు కాదు. వ్యాపార విషయాలను ఆలోచించుకుంటూ వెళ్ళేవాడు.

ఒకనాడు సాయంకాలం సమయం, హఠాత్తుగా ఆకాశంలో మబ్బులు కమ్మాయి. బాబా వెంట సేఠ్, మరి ఇద్దరు యాత్రికులు ఒక చిన్న నదీతీరంలో నడిచి వెళుతున్నారు. నది నిండుగా ప్రవహిస్తున్నది. కొంతసేపటికి నదీప్రవాహం మరింత ఉధృతమయింది. ఎగువ ప్రాంతంలో కొండల మధ్య బాగా వర్షం కురిసినట్టుంది. నదీ

జలంలో చిన్న,పెద్ద చెట్టుచేమలు,దుంగలు, ఏవేవో వస్తువులు కొట్టుకుపోతున్నాయి.

"ఏమిటిది? నల్లగా ఉంది. కంబళి కాదు కదా?" అంటూ ప్రవాహంలో కొట్టుకు వస్తున్న నల్లటి వస్తువును చూసి అడిగాడు సేఠ్.

"అవును. కంబళిలాగే ఉంది. అయినా మసకచీకటిలో స్పష్టంగా కనిపించడం లేదు," అన్నాడు సహప్రయాణీకుడు.

"చీకటి పడేలోగా మనం, అదిగో, ఆ కని పించే గ్రామాన్ని చేరుకోవాలి. వేగంగా నడ వండి," అన్నాడు బాబా.

"కొంచెం ఆగండి. కొట్టుకుపోతూన్న కంబ ళినితెచ్చుకుందాం," అన్న సేఠ్ రెండవ ప్రయా ణీకుణ్ణి, "నువ్వు నదిలోకి దూకి, ఆ కంబళిని గట్టుకు లాగగలవా?" అని అడిగాడు.

"ఇంత వేగంగా ప్రవహించే నదిలో ఈద గలంత ఈతగాణ్ణికాదు. క్షమించండి," అన్నాడు రెండవ ప్రయాణీకుడు.

"నాకు ఈత వచ్చు కాని, ఈది చాలా సంవ త్సరాలయింది. అయితే,ఈత ఒకసారి నేర్చు కుంటే జన్మాంతం మరిచిపోము కదా,"అంటూ సేఠ్ చొక్కా విప్పబోయాడు.

"అయినా, ఆ కంబళి గొడవ ఇప్పుడెందుకు? నువ్వుతీర్థయాత్రచేస్తున్నావుకదా? ఇలాంటిఅల్ప విషయాలను పట్టించుకోకుండా నీ మనసును దేవుడి మీద లగ్నం చేయడం శ్రేయస్కరం," అని హెచ్చరించాడు సాధుబాబా.

"అంత విలువైన వస్తువు కళ్ళెదుటే కొట్టుకు పోతూవుంటే, చేతులు కట్టుకుని కూర్చోవడం మహామూర్ఖత్వం!" అంటూ సేఠ్, బాబా వారి స్తున్నా వినకుండా నదిలోకి దూకేశాడు. ఈదు కుంటూ వెళ్ళి, ఆ నల్లటి వస్తువును పట్టుకో వడానికి ప్రయత్నించాడు. అయితే, కొంత సేపటికి దాంతో కలిసి సేఠ్ కూడా వెల్లువ వాలుకు కొట్టుకుపోసాగాడు!

"ఏమయింది? కంబళిని గట్టుకు లాగలేక పోతే, వదిలేసి నువ్వువెనుదిరిగి వచ్చెయ్!" అని పిలిచాడు బాబా గట్టిగా.

"నేను దానిని ఎప్పుడో వదిలేశాను. అయితే, అదే నన్ను వదలిపెట్టడం లేదు!" అంటూ కేక వేశాడు సేఠ్ ప్రాణభీతితో.

ఆ తరవాత ఎలాంటి మాటలూ వినిపించ లేదు.

ప్రవాహంలో కొట్టుకువచ్చింది కంబళి కాదనీ, ఎలుగుబంటి అనీ తరవాత తెలియవచ్చింది. హఠాత్తుగా కురిసిన వానలో తడిసిన ఎలుగు బంటి ప్రమాదవశాత్తు నదిలో పడి ప్రవాహంలో కొట్టుకుపోతున్నది. దగ్గరికి వచ్చిన లాలూసేఠ్‌ను పట్టుకున్న తరవాత అతన్ని వదిలిపెట్టడానికి దానికి మనసు రాలేదు! -బిందుసార్






## 'పంచాంగ' జన్మస్థానం



కొత్తఢిల్లీలోని 'జంతర్ మంతర్' సుప్రసిద్ధ పర్యాటక కేంద్రం. అయితే, అసలు జంతర్-మంతర్‌ను జైపూర్‌లో దాదాపు 250 సంవత్సరాలకు పూర్వం రాజా సవాయ్ జయ్‌సింగ్ నిర్మించాడు. జైపూర్ వేధశాల (అబ్జర్వేటరీ)లో సమయాన్నీ, అంతరిక్షంలోని నక్షత్రాల, గ్రహాల కదలికలనూ, గమనాలనూ తెలియజేసే రకరకాల రాతిపరికరాలు ఉన్నాయి. యేటా పంచాంగాలను తయారుచేసే ముందు భారతదేశం నలుమూలల నుంచి అంతరిక్ష శాస్త్రవేత్తలు ఇవాళ కూడా ఇక్కడ సమావేశమవుతూ ఉంటారు. పంచాంగాన్ని గణించి రూపొందించడంలో వీళ్ళు ఇక్కడి పరికరాలను బాగా ఉపయోగించుకుంటారు.

## అనుమతి నుంచి మినహాయింపు

మనదేశంలో ఎక్కడైనాసరే తుపాకులవంటి ఆయుధాలను ఉంచుకోవాలంటే అనుమతి అంటే లైసెన్స్ తప్పక తీసుకోవాలి. అయితే ఒక్క కూర్గుకు మాత్రం ఇది వర్తించదు. కర్ణాటకలో ఒక జిల్లాగా ఉంటూన్న కూర్గు అసలుపేరు కొడగు. ఇది ఒకప్పుడు స్వతంత్రరాజ్యం. బ్రిటిష్ పాలనా కాలంలో యుద్ధప్రియులైన కూర్గీల ఆదరణ పొంద డానికి పాలకులు స్థానికులను లైసెన్సు లేకుండా తుపాకులు ఉంచుకోవడానికి అనుమతించారు. ఆ ప్రత్యేకహక్కులను కూర్గీలు ఇంకా కలిగి ఉన్నారు. కొందరు భారత సేనాధ్యక్షులు కూర్గ్ నుంచే రావడం చెప్పుకోతగ్గ విశేషం. భారత సైన్యాధ్యక్ష పదవిని అలంకరించిన తొలి భారతీయుడైన ఫీల్డ్‌మార్షల్ కె.ఎం. కరియప్ప, జనరల్ తిమ్మయ్య ఈ ప్రాంతానికి చెందినవారే.





# తల్లి-కొడుకు

పేర్రాజు అనేవాడికి రెండేళ్ళ వయసప్పుడే తండ్రి పోయాడు. తల్లి సీతమ్మ అతడిని కంటికి రెప్పలా చూసుకుంటూ పెంచసాగింది. అయిదేళ్ళ వయసు రాగానే ఆమె, అతడిని ఆ ఊళ్ళో మహాపండితుడుగా పేరుపడ్డ విష్ణుశర్మ వద్దకు చదువుకు పంపింది. పదేళ్ళు వచ్చేదాకా ఆయన వద్దనే విద్యాభ్యాసం చేసిన పేర్రాజుకు, ఇక చదువంటే విసుగుపుట్టి తల్లితో, ''అమ్మా! నువ్వు కష్టపడుతూంటే నేను చూడలేకుండా ఉన్నాను. చదువు మనకు కూడు పెట్టదు. నేనూ నాలుగిళ్ళల్లో పనిచేసి నాలుగు రాళ్ళు సంపాదిస్తాను,'' అన్నాడు.

అందుకు సీతమ్మ ఒప్పుకోక, ''బాబూ, ఇది నీకు నేర్చుకోవలసిన వయసు. విష్ణుశర్మ నీకు అక్షరజ్ఞానాన్నీ, కొంత శాస్త్రజ్ఞానాన్నీ కలిగించాడు. అవి నీకు విసుగనిపిస్తే, కొంత కాలంపాటు వృత్తివిద్యలు నేర్చుకో. నేనిప్పుడు ఎంతో సంతోషంగా వున్నాను. నువ్వు ఇప్పట్నించీ సంపాదించాలనుకుంటే, నా సంతోషందుఃఖంగా మారిపోతుంది,'' అంటూ అతడికి హితబోధ చేసింది.

అయిష్టంగానే అందుకు ఒప్పుకున్న పేర్రాజు, కొందరు నిపుణులనాశ్రయించి, వారికి శుశ్రూష చేసి, అయిదు సంవత్సరాల వ్యవధిలో కొన్ని వృత్తివిద్యల్లో నైపుణ్యం సంపాదించాడు. దూరప్రదేశానికి వెళ్ళి డబ్బు, పేరు సంపాదించే అవకాశం వచ్చినా కాదని మరొక ఐదు సంవత్సరాలపాటు వృత్తి విద్యలలో మరింత కృషిచేసి బాగా రాటుదేలాడు. ఇలా వుండగా, ఆ ఊరుకు ధనవర్మ అనే వ్యాపారి వచ్చాడు. ఆ ఊళ్ళో పండే వేరుశనగలు చాలా నాణ్యమైనవని కొనడానికి వచ్చిన ఆయనకు, అనుకోకుండా పేర్రాజు తటస్థపడ్డాడు. అతడితో కాసేపు మాట్లాడాక, ''అబ్బాయ్, నువ్వు చురుకైనవాడివి. నాకు నచ్చావు. నా కూతురు

జొన్నలగడ్డ రామలక్ష్మి

స్వర్ణముఖికి మంచి వరుడికోసం చూస్తు న్నాను. నీకిష్టమైతే ఆమెను నీకిచ్చి పెళ్ళిచేసి, నా వ్యాపారమంతా నీకు అప్పజెపుతాను,'' అన్నాడు.

ఈ ప్రస్తావనకు పేర్రాజు చాలా ఆశ్చర్య పడినా, అతడిలో ఆశ కూడా పుట్టింది. ఈ దెబ్బతో తనకు జాతకం తిరిగిపోయి సమస్త సుఖాలూ అనుభవించవచ్చుననుకున్నాడు. అతడు ధనవర్మతోపాటు ఆయన ఊరు వెళ్ళాడు. తీరా చూస్తే స్వర్ణముఖి కురూపి. ధనవర్మ సంపద మాత్రం పేర్రాజు ఊహించిన దానికంటే ఎక్కువే వుంది.

''అమ్మాయి నచ్చితే వెంటనే ముహూర్తాలు పెట్టించేస్తాను,'' అన్నాడు ధనవర్మ పేర్రాజుతో.

పేర్రాజు కంగారుపడుతూ, ''అయ్యా, చిన్నతనంలోనే నా తండ్రి పోయాడు. నా తల్లి నన్ను ఎంతో కష్టపడి పెంచి పెద్దచేసి ఇంతవాణ్ణి చేసింది. నాకు అమ్మమాట శిలాశాసనం. ఆమెనడిగి, మీకేవిషయమూ చెబుతాను,'' అన్నాడు.

''చూడు, బాబూ! నువ్వు మా అమ్మాయిని పెళ్ళిచేసుకుంటే, నీ తల్లిని మా ఇంట్లో దేవతలా గౌరవిస్తాం. ఈ విషయం మీ అమ్మకు చెప్పు,'' అన్నాడు ధనవర్మ.

పేర్రాజు తన ఊరు వెళ్ళి తల్లికి విషయమంతా చెప్పి, ''అమ్మా! ఆ అమ్మాయి చూడడానికి పరమ వికారంగా వుంది. అదీగాక ఆమెను పెళ్ళిచేసుకుంటే, నేను వ్యాపారం చేయాలి. వ్యాపారం మోసంతో కూడుకున్నదని, నాకు అసహ్యం. అయినప్పటికీ నేనా అమ్మాయిని పెళ్ళిచేసుకుని వ్యాపారిని



కావాలనుకుంటున్నాను. ఎందుకంటే, ఆ ఇంట్లో అందరూ నిన్ను దేవతలా చూసుకుంటారు. నీవు ఎంతో సుఖపడవచ్చు. కాబట్టి, నువ్వీ పెళ్ళికి ఒప్పుకుంటేనేను ఎంతో సంతోషిస్తాను. నువ్వు కాదంటే, జీవితాంతం బాధ పడతాను ,'' అన్నాడు.

సీతమ్మ వెంటనే, ''నువ్వేమనుకుంటావో నాకు అనవసరం. నా కోడలు అందంగా వుండాలని నా కోరిక. కాబట్టి, నేనీపెళ్ళికి ఒప్పుకోను,'' అన్నది.

అలా కొంతకాలం గడిచాక, పేర్రాజుకు మరొక పెళ్ళి సంబంధం వచ్చింది. పెళ్ళి కూతురు రాధ చక్కని చుక్క. ఆమె అందానికి పేర్రాజు ముగ్ధుడయ్యాడు. అయినా ఆమెకు డబ్బు లేదని తటపటాయిస్తూంటే, సీతమ్మ కొడుక్కు నచ్చజెప్పి, ఆ పెళ్ళి జరిపించింది.



కొద్ది రోజులు పేర్రాజుకు హాయిగా గడి చాయి. రాధకు డబ్బాయితే లేకపోవచ్చు కానీ, డబ్బుమీద బాగా ఆశగా వుంది. ఆమె భర్తను రోజూ పట్టుచీరలు తెమ్మనీ, నగలు కొనమనీ వేధించసాగింది. అది భరించలేక పేర్రాజు, "అప్పుడు డబ్బున్న సంబంధం చేసుకుంటానంటే వద్దన్నావు. ఇప్పుడు నువ్వు తెచ్చిన పేదపిల్ల డబ్బాశతో, నా ప్రాణాలు కొరుక్కు తింటున్నది! ఏం చేయాలో నువ్వే చెప్పు," అంటూ తల్లిమీద విరుచుకుపడ్డాడు.

సీతమ్మ, రాధతో మాట్లాడితే ఆమె, "అత్తయ్యా! మనిషికి తృప్తి మంచిదేకానీ, ఆ తృప్తి చేతకానితనంవల్ల రాకూడదు. మీ అబ్బాయికి ఎన్నో విద్యలు తెలుసు. ఇక్కడ ఎంతకాలం ఉన్నా వాటివల్ల ప్రయోజనం ఉండదు. పట్నం వెళితే వాటికి రాణింపు వస్తుంది. అక్కడ బోలెడు డబ్బు సంపాదించ వచ్చు. ఆయన విద్యలకు రాణింపు తేవాలనే, నేను వేధిస్తున్నాను," అని వివరించింది.

కోడలి మాటలు సీతమ్మకు న్యాయమని పించాయి. ఆమె కొడుకునూ, కోడల్నీ పట్నం వెళ్ళమని ప్రోత్సహించింది. వాళ్ళు సీతమ్మ కూడా తమతో రావాలని పట్టుబట్టారు. అందుకు సీతమ్మ తల అడ్డంగా వూపి, "నా రెక్కల్లో ఇంకా సత్తువుంది. ఊళ్ళో నాకు తగినంత పని వుంది. పట్నంలో మీరు బాగా స్థిరపడి త్వరలో అనుకున్నవి సాధిస్తే, నేను తప్పక మీ వద్దకే వచ్చి వుంటాను. నాకు మాత్రం వేరే ఇంకెవరున్నారు?" అంటూ నచ్చజెప్పింది.

అయిష్టంగానే పేర్రాజు, భార్యా సమే తంగా పట్నం వెళ్ళాడు. అయితే, అక్కడ అతడేప్రయత్నం చేసినా కలిసిరాలేదు. భార్య అతడి అసమర్థతను తిట్టిపోసింది. పేర్రాజు నీరసపడి, "పోనీ, నువ్వేదైనా మంచి సలహా ఇవ్వు. అక్షరాలా పాటిస్తాను," అంటూ భార్య సాయం కోరాడు.

"ఆడదాన్ని. నేనేం సలహాలిస్తాను. నువ్వు సంపాదించి తెస్తే పొదుపుగా ఖర్చు పెడతాను. నిన్ను సంతోషంగా వుంచుతాను. అయినా నన్ను సలహాలడిగే నీవల్ల, నేననుకున్నది సాధ్యమవుతుందనిపించదు. మనం అత్తయ్య దగ్గరకు వెళ్ళిపోదాం. భార్యను సలహాలడిగే వాడు తల్లి నీడలో బ్రతకడంలో తప్పు లేదు," అంటూ ఈసడించింది రాధ.

ఆ మాటలకు వీర్రాజు పౌరుషపడలేదు. అతడు తల్లి దగ్గరకు వెళ్ళిపోవాలనే అనుకు న్నాడు. కానీ అనుకోకుండా అతడికి జబ్బు చేసింది. వైద్యుడు చూసి పరీక్షచేసి, కొన్ని

మందులిచ్చి, కొన్ని జాగ్రత్తలు కూడా చెప్పాడు. కానీ పేర్రాజు జాగ్రతలు పాటించేవాడు కాదు. అందువల్ల ఎన్నిరోజులు గడిచినా అతడి జబ్బు తగ్గడం లేదు.

"వైద్యుడు చెప్పిన మాట బొత్తిగా వినడం లేదు. ఇలాగైతే మీ జబ్బు ఎప్పటికి తగ్గేను? ఇది తగ్గేదాకా మనం ఊరి ప్రయాణం కూడా చేయడానికి లేదు," అని రాధ, భర్తమీద విసుక్కుంది.

"వైద్యుడు వద్దన్నాసరే, మనం ఊరి ప్రయాణం చేసి అమ్మ దగ్గరకు వెళ్ళిపోదాం. అమ్మదగ్గరుంటే, నాకు జబ్బు తగ్గిపోతుంది," అన్నాడు పేర్రాజు.

రాధ ఈ విషయం వైద్యుడికి చెప్పుకుంది. ఆయన కాసేపాలోచించి, "చూడమ్మా! పిల్లల శరీరతత్వాలు తల్లికి తెలిసినట్టు వైద్యుడికి కూడా తెలియవు. నేనిచ్చే మందులు ఏ జాగ్రత్తలూ లేకపోయినా, అతడికీపాటికి జబ్బు తగ్గించి వుండాలి. అలా జరగలేదంటే, అందుకింకేదో కారణముండాలి. అది అతడి తల్లికే తెలుస్తుంది. దూరప్రయాణం ఏమాత్రం మంచిది కాదు, కాబట్టి, నువ్వు కబురుపెట్టి, నీ అత్తగారినే ఇక్కడకు రప్పించు," అని రాధకు సలహా ఇచ్చాడు.

రాధ ఆ సలహా పాటించింది. రెండు రోజుల్లో సీతమ్మ అక్కడకు వచ్చింది. పేర్రాజు, తల్లిని చూసి కళ్ళనీళ్ళు పెట్టుకుని, "అమ్మా! నువ్వు దగ్గరలేకుంటే, నాకు ఏదోలా వుంది. నా జబ్బు తొందరగా తగ్గేలా చూడు. నాకు జబ్బు తగ్గగానే, నువ్వు నాకు గారెలు చేసి పెట్టాలి. నీ చేతి గారెలు తినాలని నాకెంతో మనసుగా వుంది," అన్నాడు.



సీతమ్మ వచ్చిన నాలుగు రోజుల్లోనే, పేర్రాజు ఆరోగ్యం చాలావరకూ కుదుట పడింది. అప్పుడామె వైద్యుడితో, "అయ్యా! అబ్బాయికి గారెలు తినాలని వుంది. చేసి పెట్టవచ్చా?" అని అడిగింది.

"నీ కొడుకు మరొక మాసం రోజులదాకా నూనెవంటకాలు తినకూడదు. ఇతడు ఇప్పట్లో కోలుకోకూడదనుకుంటేనే గారెలు చేసి పెట్టు!" అని మందలింపుగా చెప్పాడు వైద్యుడు. ఆ మాటలు పేర్రాజు కూడా విన్నాడు.

అయితే సీతమ్మ, వైద్యుడి మాటలు పట్టించుకోకుండా కొడుక్కు గారెలు వండి పెట్టింది. పేర్రాజు తల్లిపై విసుక్కుంటూ, "వైద్యుడేం చెప్పాడు? నీకు నేను బ్రతకాలని లేదా, గారెలు వండావు!" అన్నాడు.

"నీ శరీరతత్వం నాకు బాగా తెలుసు. సంతోషంగా గారెలు తిను," అంటూ సీతమ్మ

కొడుకును బలవంతపెట్టింది. భర్తకు ఏమవు తుందో అని రాధ భయపడింది కానీ, పేర్రాజు మరింత తొందరగా కోలుకున్నాడు.

రాధ ఎంతో ఆశ్చర్యపడి, "అత్తయ్యా! మీరు వైద్యుడు చెప్పినదానికి భిన్నంగా చేసినా ఆయన మరింత త్వరగా జబ్బునుంచి బయట పడ్డాడు. ఇది నాకు చాలా ఆశ్చర్యంగా వుంది," అన్నది.

దానికి సీతమ్మ నవ్వి, "అబ్బాయి సంగతి నాకు బాగా తెలుసు. వాడు మనసులో ఒక టుంచుకుని పైకి ఇంకొకటి చెబుతాడు. తప్పు తన మీదికి రావడం ఇష్టం లేకనే వాడు, నా మాట విన్నట్టు నటిస్తాడు. వాడికిష్టమైనదే నేనూ చెబుతూండడం వల్ల, విసుగు నటించినా, నేను చెప్పినది వాడి మనసుకు నచ్చుతుంది. మనసుకు నచ్చిన పనిచేయడం సంతోషాన్ని స్తుంది. ఏ మనిషికైనా సంతోషమిచ్చే ఆరోగ్యం, మందులు కూడా ఇవ్వలేవు!" అన్నది.

ఆ మాటలతో రాధకు కనువిప్పయింది. ఆమె అత్తగారి పాదాలకు మ్రొక్కి, "ఇప్పుడు నా లోపం నాకు తెలిసింది. ఆయనలోని సమర్థత వెలికి రావాలంటే, ఆయన తప్పులకు నేను బాధ్యత వహించాలి. అది సాధ్యం కావా లంటే, కన్నతల్లి అంతగానూ నేనాయన్ను ఆదరించాలి, ప్రేమించాలి. అందుకు పాఠాలు మీ దగ్గరే నేర్చుకుంటాను. మీరిక మా దగ్గరే వుండి, నన్ను తీర్చిదిద్దాలి!" అన్నది.

సీతమ్మక్కూడా కొడుకు దగ్గరుండడం ఇష్టమే! కోడలు కూడా మనస్ఫూర్తిగా తనను అడుగుతున్నదని గ్రహించాక, ఆమె సంతో షంగా, "రాధా! నేను కొన్నాళ్ళుగా ఇక్కడికి వచ్చి మీతో కలిసి వుండాలనుకుంటున్నాను. కాపరం ఎలాంటి ఒడుదుడుకులు లేకుండా ఆనందంగా సాగిపోవాలంటే, భార్యాభర్తల మధ్య ఆలోచనల్లో, ప్రవర్తనలో అనుకూలత వుండాలి. ఇందుకుగాను మరొకరి నుంచి పాఠాలు నేర్చుకోవవసిన అవసరం లేదు. అనుభవం నుంచి గ్రహించగలిగే వివేకమే అందుకు ఉపకరిస్తుంది. అలా కానప్పుడు స్వర్గ సీమగా వుండవలసిన గృహం, నరకప్రాయ మవుతుంది," అని హితవు చెప్పింది.

ఆ తర్వాత ఆ అత్తాకోడళ్ళ అన్యోన్యతా, తనపట్ల శ్రద్ధా కారణంగా, పేర్రాజు పట్నంలో గొప్పగా రాణించి, తను సంతోషంగా ఉంటూ, వాళ్ళను సంతోషపెడుతూ కలకాలం సుఖంగా జీవించాడు.







చందమామ కానుక

# రథయాత్ర

## శ్రీ జగన్నాథ చరిత్ర

మనోజ్‌దాస్



# రథయాత్ర
# శ్రీ జగన్నాథ చరిత్ర

అతిపురాతనకాలం నుంచి శ్రీ క్షేత్రంగా పిలువబడే ఒరిస్సాలోని పూరీనగరం, శ్రీ జగన్నాథ మందిరం వెలయడంతో జగత్ప్రసిద్ధిగాంచింది! ఈ దేవాలయంలోని విగ్రహంలో శ్రీకృష్ణపరమాత్మ అవశిష్టాలు ఉన్నట్లు భక్తులు విశ్వసిస్తారు.

జగన్నాథుడు అంటే శ్రీకృష్ణుడు. అన్న బలభద్రుడు, చెల్లెలు సుభద్ర సమేతంగా శ్రీకృష్ణుడు ఇక్కడ పూజింపబడుతున్నాడు. శ్రీకృష్ణుడు కంసుణ్ణి సంహరించడానికి గోకులం నుంచి మధురానగరానికి బయలుదేరిన ఘట్టానికి జ్ఞాపకార్థంగా యేటా రథయాత్ర జరుపుతారు!

మొట్టమొదటి దేవాలయాన్ని నిర్మించిన ఇంద్రద్యుమ్న మహారాజు, ఆయన సతీమణి గుండిచాదేవి అభీష్టానుసారం ఈ సంప్రదాయం ఆరంభమయినట్టు చెబుతారు.

మూడు విగ్రహాలను బ్రహ్మాండమైన మూడు రథాలలో అమర్చి, వేలాది భక్తులు బాడాదండా (మహనీయ మార్గం) గుండా తాత్కాలిక నివాసానికి చేరుస్తారు. రథోత్సవాన్ని తిలకించడానికి దేశం నలుదిశల నుంచే కాకుండా విదేశాలనుంచి కూడా వేలాదిమంది ప్రజలు విచ్చేస్తారు.

ప్రధాన రథోత్సవం పూరీలోనే జరిగినప్పటికీ దేశంలోని వివిధ ప్రాంతాలలోనూ రథోత్సవాలు ఘనంగా జరుగుతాయి. ఇటీవలి కాలంలో కృష్ణభక్తిని అవలంబిస్తున్న భక్తులు, కొన్ని పాశ్చాత్య నగరాలలోనూ ఉత్సాహంగా రథోత్సవాలను జరుపుకుంటున్నారు.

పురాణకాలానికి చెందిన ఆసక్తికరమైన శ్రీ జగన్నాథ చరిత్ర ఇలా సాగుతుంది:

ఇంద్రద్యుమ్నుడనే రాజు పరిపాలనలో ప్రజలు ఎటువంటిలోటూ లేకుండా సుఖశాంతులతో జీవించారు. ఇంద్రద్యుమ్నుడు కళాభిమానిగానూ, కవిపండిత పోషకుడుగానూ కీర్తిగాంచాడు. ఆయన ధర్మపాలననూ, సుగుణాలనూ పొగుడుతూ కవులు కావ్యాలు రచించారు.

ఇంత సాధించినప్పటికీ, రాజును ఎప్పుడూ ఏదో అసంతృప్తి వెంటాడసాగింది. తనకు తీరని కోరిక ఏదీ లేదు. అయినా, తెలియని అసంతృప్తి తననెందుకు ఇలా బాధిస్తున్నదన్న విషయం, రాజుకు మొదట అంతుబట్టలేదు. యథాలాపంగా ఆయనకొక ఆలోచన తట్టింది. భావితరాల భక్తులకు యాత్రాస్థలంకాగల బ్రహ్మాండమైన దేవాలయం నిర్మించాలి! ఆ ఆలోచన కలగగానే ఆయనలో అంతకు పూర్వమున్న అసంతృప్తి కాస్త తగ్గింది. అయినా, నిర్మించిన ఆలయంలో ఏ దైవవిగ్రహం ప్రతిష్ఠించాలన్న సమస్య ఎదురయింది. రాజు గాఢనిద్రలో ఉండగా "మొదట ఆలయనిర్మాణం పూర్తికానివ్వు; కాలం అసన్నమయినప్పుడు విగ్రహం దానంతట అదే వస్తుంది!" అన్న దివ్యస్వరం కలలో వినిపించింది.

రాజు అమితానందంతో నిద్రలేచాడు. తెల్లవారగానే మంత్రులను పిలిపించి, తన మనోరథాన్ని తెలియజేశాడు.

ఒక శుభముహూర్తాన, సువిశాలమైన పూరీ సముద్రతీరంలో మేళతాళాలతో, వేదమంత్రాలతో, ఆగమవేత్తల ఆధ్వర్యంలో ఆలయనిర్మాణ కార్యక్రమం ప్రారంభమయింది!

ఆలయనిర్మాణానికి కావలసిన ప్రత్యేకమైన పెద్దపెద్దబండరాళ్ళను దూరప్రాంతాల కొండల నుంచి తెప్పించారు. సముద్రం గుండా, నదుల గుండా, ఓడలలోనూ, పడవలలోనూ, ఏనుగులు పూన్చిన బళ్ళమీదా వాటిని సముద్రతీరానికి చేరవేశారు.

దేశం నలుమూలల నుంచి వచ్చిన వేలకొలది శిల్పులూ, పనివాళ్ళూ రాత్రింబవళ్ళు ఆలయనిర్మాణానికి పూనుకున్నారు. భక్తిశ్రద్ధలతో నిండిన వాళ్ళ ఉత్సాహం; నిర్విరామ పరిశ్రమ ఫలితంగా



కఠినశిలలలో అందమైన పువ్వులు పుట్టుకొచ్చాయి. అపురూపశిల్పాలు రూపులు దిద్దుకున్నాయి. కొన్ని సంవత్సరాలలో ఆలయనిర్మాణం పూర్తయింది. కడలి తరంగాలు స్పృశించే సాగరతీరంలో మేఘాలను అందుకునే ఎత్తుకు బ్రహ్మాండమైన ఆలయం ఎదిగింది!

ఆలయ నిర్మాణం పూర్తికాగానే, గుడిలో దేవుడెక్కడ—అని అందరూ ప్రశ్నించసాగారు. రాజు కూడా ఈ విషయమై తీవ్రంగా ఆలోచించసాగాడు. దిగులు పడసాగాడు. ఒకనాడాయన ఆలయంలో ప్రవేశించి గర్భగుడికేసి చూస్తూ కూర్చుని, "దేవా, ఈ గుడిలో ఏ రూపంలో కొలువుతీరాలని నీ సంకల్పం. ఇంకా ఎంతకాలమని వేచివుండాలి? ఇన్ని శ్రమలకోర్చి నిర్మించిన ఈ ఆలయం ఇలా శూన్యంగా వుంటే, నలుగురూ నన్ను చూసి నవ్వరా?" అని కన్నీళ్ళతో ప్రార్థించాడు.

ఆ రోజు రాత్రి రాజు కలగన్నాడు. "ఇక్కడికిసమీపంలోనే దేవుడు శ్రీకృష్ణరూపంలో ఉన్నాడు. అన్వేషిస్తే ఆ కరుణాసింధువు నీ వశమవుతాడు!" అన్న దివ్యసందేశం అందింది.

భక్తులతో దాగుడుమూతలాడడం కృష్ణుడి స్వభావం గనక, అతడి విగ్రహం అంత సులభంగా లభ్యం కాదని రాజు గ్రహించాడు. ఆ మహానుభావుణ్ణి కనుగొనగలవాడు నిర్మల హృదయంగల వివేకసంపన్నుడయిన భక్తుడై వుండాలి. అందువల్ల ఆ మహత్కార్యాన్ని రాజు తన ఆస్థానంలోని నలుగురు పండితులకు అప్పగించాడు. నలుగురూ నాలుగు దిక్కులకు బయలుదేరారు.

ఆ నలుగురిలో చిన్నవాడయిన విద్యాపతి తూర్పుదిక్కుగా బయలుదేరి కొంతదూరం వెళ్ళి, ఆ తరవాత ఉత్తర దిక్కుగా తిరిగాడు. అక్కడ అరణ్యప్రాంతం ఎదురయింది. మనసులో కృష్ణుణ్ణి ప్రార్థిస్తూ, తనను నడిపించే భారం దేవుడిదే అన్న శరణాగత భావంతో, దేవుడు చూపిన మార్గంలో నడుస్తున్నట్టు భావిస్తూ అరణ్యంలో ప్రవేశించాడు.

అరణ్యం మధ్య చిన్నకొండ కనిపించింది. కొండనుంచి లయబద్ధమైన సంగీతం వినవచ్చింది. ఇది సంగీతపర్వతం కాదుకదా అనుకుంటూ విద్యాపతి దానిని సమీపించాడు. మృదంగ ధ్వనులూ, వేణునాదమూ, కరతాళ ధ్వనులూ కలిసి ఒక అద్భుతగానం వినిపించింది. కొండకు అవతలివైపు నుంచి సంగీతం వస్తున్నట్టు విద్యాపతి గ్రహించాడు.

అతడు మెల్లగా కొండ ఎక్కి చూశాడు. కొండనానుకొని అందమైన లోయ. అక్కడ కొందరు కోయయువతులు పాడుతూ నృత్యం చేస్తున్నారు. కిందికి దిగుతూ ఆ దృశ్యాన్ని చూస్తూ, విద్యాపతి పక్కనున్న చెట్టుకొమ్మను పట్టుకుని నిలబడ్డాడు. హఠాత్తుగా పులి గాండ్రింపు విని ఉలిక్కిపడి వెనక్కు తిరిగి చూశాడు విద్యాపతి. పులి గాండ్రిస్తూ అతనికేసి పరిగెత్తి వస్తున్నది. ఏమిచేయడానికీ తోచక హడలిపోయి అతడక్కడే స్పృహతప్పి పడిపోయాడు!

'రాజా!' అన్న స్త్రీ కంఠస్వరం వినగానే పులి చటుక్కున ఆగిపోయింది.

"ఇలా తిరిగిరా!" అని పిలిచిందా స్త్రీ మళ్ళీ.

పులి వెనుదిరిగి మెల్లగా స్త్రీలకేసి వెళ్ళి తనను పిలిచిన యువతి పాదాలవద్ద కుక్క పిల్లలా పడుకుంది. ఆ యువతి పులి వీపుపై ఆప్యాయంగా తట్టింది. ఆమె పేరు లలిత; కోయదొర విశ్వావసు ఏకైక కుమార్తె!

లలిత చెప్పగానే, ఇద్దరు యువతులు పరిగెత్తిపోయి, స్పృహతప్పి పడివున్న విద్యాపతికి, అరటి ఆకులతో మెల్లగా వీచారు. ఇంకొక యువతి, దగ్గరున్న సెలయేటి నుంచి తామరాకుతో నీళ్ళు తెచ్చి, అతని ముఖంమీద చిలకరించింది. అతడు మెల్లగా కళ్ళు తెరిచాడు. యువతులు తాగడానికి నీళ్ళిచ్చారు.

ఆ తరవాత లలిత అతన్ని సమీపించి, "నువ్వెవరో మాకు తెలియదు. ఎక్కడి నుంచి ఎక్కడికివెళుతున్నావో కూడా తెలియదు. నిన్నీస్థితిలో వదిలి వెళ్ళడానికి మనసొప్ప డంలేదు. మా వెంట, మా గూడానికి వస్తావా?" అని అడిగింది.



ఆమె మాటలకు విద్యాపతి ఆనం దించాడు. ఆమెవెంటవెళ్ళడానికిమౌనంగా లేచి నిలబడ్డాడు. లలిత ముందు దారి తీయగా, విద్యాపతీ, చెలికత్తెలూ ఆమె వెంట నడిచారు. లలిత ఒక యువతిని దగ్గరికి పిలిచి, తాము వస్తున్న సంగతి తండ్రికి ముందుగా తెలియజేయమని చెప్పింది.

మరికొంతసేపటికి ఎదురుగా వున్న చిన్న కొండమీద ఆజానుబాహుడైన కోయదొర విశ్వావసు ఎదురై, విద్యాపతికి చేతులెత్తి నమస్కరిస్తూ, "మీకు మా హృదయపూర్వక స్వాగతం తెలియ జేస్తున్నాము," అన్నాడు గంభీరంగా.

విద్యాపతి ప్రతినమస్కారం చేస్తూ, "ఇంద్రద్యుమ్న మహారాజు పంపగా ఒక దైవకార్యార్థం నేను ఇటు వచ్చాను," అన్నాడు.

విద్యాపతిని గౌరవమర్యాదలతో తమ గూడానికి తీసుకుపోయి, అతనికి కావలసిన వస తులన్నీ ఏర్పాటుచేశాడు విశ్వావసు. ఇంతలో, విద్యాపతి గొప్ప పండితుడని గ్రహించి, ఆయన పరమానందం చెందాడు. కొన్నాళ్ళు అక్కడే వుండి, వేదాంత రహస్యాలు తెలియజేయమని విద్యాపతిని ప్రార్థించాడు! విద్యాపతి కూడా అందుకు అంగీకరించాడు. అక్కడే కొంతకాలం వుండాలన్న భావం అతని మనసులో ఏర్పడింది. విద్యాపతి, శృతుల నుంచీ, స్మృతుల నుంచీ

శ్లోకాలు చెబుతూ, వాటి అర్థతాత్పర్యాలను ఉదాహరణలతో వివరించసాగాడు. ఆయన వివరణలను విశ్వావసు, లలిత ఆసక్తిగా విన్నారు.

ఆ సమయంలో లలిత తనపట్ల అభిమానం చూపడం విద్యాపతి గమనించాడు. కాని, తాను సాధించాలని బయలుదేరి వచ్చిన కార్యం మహోన్నతమైనది. అందువల్ల అతడు దానిమీదే మనసు లగ్నంచేసి, తరచూ భగవధ్యానంలో గడిపేవాడు!

ఉన్నట్టుండి విద్యాపతికి జబ్బుచేసింది. ఆ సమయంలో లలిత, దగ్గరే వుండి పరిచర్యలు చేసింది. ఒకరికొకరు సన్నిహితులయ్యారు. ఆ సమయంలో, లలిత మాత్రమే కాదు; తను కూడా ఆమెను అభిమానిస్తున్నట్టు విద్యాపతి గ్రహించాడు. ఇరువురికీ వివాహం జరిపించాలని విశ్వావసు ఆశించాడు. అందుకు విద్యాపతి కూడా సమ్మతించాడు. కోయిల పాటలు, కోయ యువతుల ఆటపాటల మధ్య లలితా, విద్యాపతుల వివాహం అత్యంత వైభవోపేతంగా జరిగింది! సంతోషంగా కొన్నాళ్లు గడిచిపోయాయి. లలితను పెళ్ళాడినందుకు విద్యాపతి సంతోషించినప్పటికీ, తను రాజధాని నుంచి వచ్చిన దైవకార్యం ఇంకా నెరవేరలేదన్న బాధ అతన్ని అనుక్షణం వేధించసాగింది!

ఈ సమయంలో అతడొక విషయం గమనించాడు. విశ్వావసు రోజు తప్పకుండా వేకువ జామున నిద్రలేచి, ఎక్కడికో వెళ్ళి, సూర్యోదయం అయ్యాక తిరిగి వస్తున్నాడు. గాలీ, వానా, తుఫానూ ఏది వచ్చినా అతడు వెళ్ళడం మానడం లేదు. విశ్వావసు అచంచలమైన పట్టుదలకు విద్యాపతి ఆశ్చర్యం చెందాడు. విశ్వావసు అలా ఎక్కడికి వెళ్ళివస్తున్నాడో తెలుసుకోవాలన్న ఆసక్తి అతనికి ఎక్కువయింది. లలితను అడిగాడు.

"అది మా వంశానికి సంబంధించిన రహస్యం. దానినెవరికీ చెప్పకూడదు. అయినా, భర్తవైన నీ నుంచి ఎటువంటి రహస్యాలూ దాచలేకుండా వున్నాను. ఇక్కడికి సమీపంలో ఒక గుహ వున్నది. ఆ గుహ లోపల, తరతరాలుగా మా పెద్దలు పూజిస్తూన్న దేవుడున్నాడు. ఆ దేవుణ్ణి ఆరాధించడానికే మా తండ్రి రోజూ వెళ్ళి వస్తాడు. మా తండ్రిలాగానే, మా తాత ముత్తాతలుకూడా ఆ దేవుణ్ణి ఆరాధించారని చెబుతారు," అన్నది లలిత.

"నాకు ఆ దేవుణ్ణి చూడాలని ఉన్నది!" అన్నాడు విద్యాపతి ఉత్సాహంగా.

"ఆ దేవుణ్ణి గురించి ఇతరులకు చెప్పడమే అపరాధంగా భావిస్తాడు మా తండ్రి. అలాంటప్పుడు చూడడమంటే ఇంకేమైనావుందా? దయచేసి ఆ కోరికను వదులుకోండి," అన్నది లలిత ప్రాధేయపడే ధోరణిలో.

"నిన్ను పెళ్ళాడిన తరవాత కూడా నన్ను పరాయివాడిగానే భావిస్తున్నావా?" అని అడిగాడు విద్యాపతి బాధగా.

లలిత కొంతసేపు మౌనంవహించి, "సరే, నిన్ను ఆ గుహదగ్గరికి తీసుకువెళ్ళి, దేవుణ్ణి చూపమని మా తండ్రితో చెబుతాను. నిశ్చింతగా వుండు!" అని చెప్పింది.

ఆ రోజు రాత్రి లలిత, గుహలోని దేవుణ్ణి చూడాలన్న తన భర్త కోరికను తండ్రికి తెలియ

## నీలమాధవ దేవాలయం

విద్యాపతి కళ్ళకు గుడ్డ కట్టడంవల్ల ఎక్కడికి తీసుకువెళుతున్నదీ అతనికి తెలియలేదు. విశ్వావసు అతని కళ్ళకు కట్టిన గుడ్డను విప్పాడు. హఠాత్తుగా అక్కడ నీలవర్ణ ప్రకాశం మెరిసింది. విద్యాపతికి వేణువు ఊదుతూ ఉన్న శ్రీకృష్ణ రూపదర్శనం అయింది. అందుకే ఆ దేవుడికి నీలమాధవుడనే పేరు వచ్చింది. పూరీజగన్నాథ ఆలయంవంటిదే అయిన చిన్న నీలమాధవ మందిరం మహానదీ తీరంలోని చిన్నకొండ మీద వెలుగొందుతున్నది. ఖాండపారకు పదిహేను కి.మీ. దూరంలో కాంటిలో గ్రామ సమీపంలో ఈ కొండ ఉన్నది. కటక్-సోనేపూర్ రోడ్డు ఈ గ్రామం గుండా వెళుతుంది. ఇత్తడి, కంచు పాత్రల తయారీకి కాంటిలో చాలా ప్రసిద్ధి. నీలమాధవ ఆలయంలో యేటా వివిధ ఉత్సవాలతో పాటు భౌమఏకాదశి ఉత్సవాన్ని అత్యంత వైభవంగా జరుపుతారు. ఈ ఉత్సవంలో పాల్గొనడానికి వేలాదిమంది భక్తులు ఇక్కడికి వస్తారు.

జేసింది. విశ్వావసు కోపంగా ఆమెకేసి చూశాడు. కాని, ఏమీ మాట్లాడలేదు.

కొంతసేపు మౌనం వహించి, లలిత, "నాన్నా, నేను మీకు ఏకైక సంతానం కదా? మీ అనంతరం మీరు ఆరాధిస్తున్న దేవుణ్ణి ఎవరు పూజించగలరు? ఆ బాధ్యత మీ అల్లుడయిన విద్యాపతికి ఉన్నది కదా? అలాంటప్పుడు, ఆ దేవుణ్ణి ఆయనకు చూపడంలో తప్పేమిటి?" అని అడిగింది.

విశ్వావసు కూతురు కోర్కెను కాదనలేక పోయాడు. తాను, దేవుణ్ణి పూజించే బాధ్యతను వేరొకరికి అప్పగించేప్పుడు మాత్రమే, ఆ గుహకు వెళ్ళే మార్గాన్ని చూపాలన్న నియమాన్ని మాత్రం అతిక్రమించలేనన్నాడు, విశ్వావసు.



అందువల్ల, కళ్ళకు గుడ్డకట్టుకుని ఆయన వెంట వెళ్ళడానికి విద్యాపతి అంగీకరించాడు!

మరునాడు యథాప్రకారం సూర్యోదయానికి ఒక గంట ముందే, విశ్వావసు నిద్రలేచి సిద్ధమై, విద్యాపతి కళ్ళకు నల్ల గుడ్డను కట్టి, అతని కుడిచేయి పట్టుకుని నడిపిస్తూ, తిన్నగా గుహకు బయలుదేరాడు.

అయితే, విద్యాపతి ఎవరికీ తెలియకుండా, ఎడమ చేతిలో గుప్పెడు ఆవాలు తీసుకుని, దారి పొడవునా జార విడుస్తూ, విశ్వావసు వెంట నడిచాడు.

"నాయనా, మనం గుహను సమీపించాము. తలను కొంచెం కిందికి దించు; గుహలో ప్రవేశించాలి," అంటూ విశ్వావసు అతని కళ్ళకు కట్టిన గుడ్డను విప్పాడు.

విద్యాపతి కళ్ళు తెరిచాడు. అతని దృష్టి గుహ లోపలవున్న ఒక పెద్ద రాతిపీఠం మీద పడింది. విశ్వావసు ఆ పీఠం మీద కొన్ని పువ్వులు ఉంచాడు. మెరుపులా నీలవర్ణ ప్రకాశం మెరిసింది. ఒక్క క్షణంలో విద్యాపతికి వేణువును ఊదుతూవున్న శ్రీకృష్ణ రూపదర్శనం అయింది. ఆనందాశ్చర్యాలతో "ఆహా" అని అరిచాడు విద్యాపతి!

"ఏమయింది నాయనా?" అని విశ్వావసు విద్యాపతి వెన్ను చరిచాడు.

ఆ మాటలతో స్పృహలోకి వచ్చాడు విద్యాపతి.

అతడు మౌనంగా తలవంచుకున్నాడు. అతణ్ణి గుహదగ్గరికి తీసుకువచ్చిన విధంగానే, మళ్ళీ కళ్ళకు గుడ్డకట్టి, నడిపించుకుంటూ, విశ్వావసు గూడెంకేసి బయలుదేరాడు.

వారి రాకకోసం ఎదురుచూస్తూన్న లలిత, "గుహ లోపల ఏం చూశారేమిటి?" అని అడిగింది భర్తను ఉత్సాహంగా.

"చీకటి గుహ లోపల ఏం అద్భుతం ఉంటుంది. చెప్పుకోతగిందేమీ అక్కడ కనిపించ లేదు," అన్నాడు విద్యాపతి ముభావంగా.

తాను గుహలోపల చూసిన అద్భుత దృశ్యాన్ని, భార్య లలితకు చెప్పడానికి కూడా విద్యాపతి సంశయించాడు. అయితే, ఈ రహస్యాన్ని తనలో దాచుకోవడానికి అతడు ఎంతో శ్రమపడ్డాడు.

విశ్వావసు పూజిస్తున్నది శ్రీకృష్ణ రూపమని అతడు గ్రహించాడు. తను వచ్చిన పని సఫలం కావాలంటే, విశ్వావసు పూజిస్తున్న శిలారూపాన్ని తీసుకుని రాజధానీనగరం చేరుకోవాలి! అలా చేయడం, తనను ఆదరించి ఆప్యాయత చూపేవారి నమ్మకాన్ని వమ్ము చేయడమే అవుతుంది. నమ్మకద్రోహానికి పాల్పడడం ధర్మమా? అయినా, విశ్వావసు తనను ఎక్కడ నమ్మాడు? అసలు నమ్మి ఉన్నట్టయితే, కళ్ళకు గుడ్డకట్టి తనను తీసుకుపోతాడా? అందు వల్ల గుహనుంచి దైవరూపాన్ని తీసుకువెళ్ళడం ఎత్తుకు పైఎత్తు తప్ప నమ్మకద్రోహం ఎలా అవుతుంది?

ఇలాంటి ఆలోచనలతో పగలంతా పరధ్యానంగా గడిపేవాడు. రాత్రులలో కంటి మీదికి కునుకు వచ్చేది కాదు. అయినా ఏ సమస్యకుగాని, కేవలం వాదోపవాదాలే పరిష్కారాలు కావుకదా!

విద్యాపతిలో వచ్చిన మార్పును గమనించిన లలిత దిగులు చెందింది. తనను పెళ్ళాడినందుకు పశ్చాత్తాపపడు తున్నాడా? నగరంలోని ఆడంబరాలు దూరమయ్యాయని







విచారపడుతున్నాడా? అసలు విషయం తెలుసుకోవాలని, ఆమె ఒకనాడు విద్యాపతిని అడిగింది.

''రాజధానిలోని నా తల్లిదండ్రులను వదిలి వచ్చి చాలా కాలమయింది. త్వరగా వెళ్ళి, వృద్ధులయిన నా తల్లి దండ్రుల క్షేమం చూడవలసింది కన్నబిడ్డగా నా ధర్మం కాదా? అయినా, నిన్ను ఇక్కడే వదిలి వెళ్ళడానికి మనసొప్పడం లేదు. కానీ, నిన్ను నా వెంట తీసుకు వెళ్ళానంటే అక్కడ వున్న వాళ్ళందరూ నిన్ను వింతగా చూస్తారేమో, అని అనుమానంగా ఉన్నది. పైగా నీ మీద పంచప్రాణాలు పెట్టుకున్న నీ తండ్రి, నిన్ను వదిలి వుండగలడా?'' అన్నాడు విద్యాపతి.

''ఇప్పటిలాగానే మీరు నన్ను ఆప్యాయంగా చూసుకుంటున్నంతకాలం ఎవరేమనుకున్నా నాకు బాధలేదు,'' అని, లలిత కొంతసేపు మౌనం వహించి ఆ తరవాత, ''అయినా, నేను మీ వెంట వస్తే మా తండ్రినెవరు చూసుకుంటారు? అదే విచారంగా వుంది!'' అన్నది కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ.

''అవును. ఎన్నటికీ మీ తండ్రిని వదిలి రాకూడదు. అందుకే, నువ్వు అనుమతించావంటే, నేను వెళ్ళి మా తల్లిదండ్రులను చూసి, త్వరలో తిరిగి వస్తాను,'' అన్నాడు విద్యాపతి.

''నిజంగా మీరు తిరిగి రాగలరా?'' అని అడిగింది లలిత దిగులుగా.

''నేను నిన్ను వదిలి వుండగలనా?'' అన్నాడు విద్యాపతి.

''అలా అయితే, నిశ్చింతగా వెళ్ళిరండి. మా అత్తమామల ఆశీస్సులు పొందే సుదినం కోసం నేను ఎదురుచూస్తున్నట్టు వారికి తెలియజేయండి,'' అన్నది లలిత.

లలిత భర్త కోరికను తండ్రికి తెలియజేసింది. విశ్వావసు కూడా అందుకు సమ్మతించి, విద్యాపతి కోసం కానుకలు సిద్ధం చేయసాగాడు. కాని విద్యాపతి అడ్డుపడి, ''లలితను రాజధానికి వెంటబెట్టుకుని వెళ్ళేప్పుడు కానుకలతో వెళ్ళడం ఉచితంగా వుంటుంది. మొదట, మా వివాహం గురించి, మా తల్లిదండ్రులకు తెలియచేయాలి కదా?'' అన్నాడు విద్యాపతి.

అతని మాటలు విశ్వావసుకు సబబుగా తోచాయి. ఆయన అల్లుడి ప్రయాణానికి ఒక బలమైన గుర్రాన్ని ఏర్పాటుచేశాడు. విశ్వావసు లలితల వద్ద సెలవు తీసుకుని, విద్యాపతి గుర్రం మీద బయలుదేరాడు.

లలిత విద్యాపతికి కన్నీళ్ళతో వీడుకోలు పలికింది!

కొన్నాళ్ళక్రితం, విద్యాపతి రహస్యంగా జారవిడుస్తూ వెళ్ళిన ఆవగింజలు మొలకలెత్తి, స్పష్టంగా కనిపిస్తున్నవి. వాటిని అనుసరిస్తూ కొంతదూరం వెళ్ళాక అతడొక గుహను సమీపించాడు.



విద్యాపతి గుర్రంపై నుంచి కిందికి దిగి, జాగ్రత్తగా గుహ లోపలికి ప్రవేశించాడు. అక్కడ అతడు మరొకసారి అద్భుతమైన అనుభూతికి లోనయ్యాడు. "దేవా, నీ మీద భారం వేసి, ఉత్తమమని తోచిన నా కర్తవ్యాన్ని నిర్వహిస్తున్నాను. అపరాధమయితే క్షమించి, రక్షించు," అని మనసులో ప్రార్థిస్తూ, విశ్వావసు పువ్వులు ఉంచిన రాతిపీఠం మీది చిన్న శిలాప్రతిమను తీసుకుని కళ్ళకద్దుకుని సంచిలో వేసుకుని, విద్యాపతి వెలుపలికి వచ్చి, గుర్రమెక్కి, దాన్ని ముందుకు అదిలించాడు.

విద్యాపతి కొన్నిగంటలు ప్రయాణం చేశాక, అరణ్యం దాటి పచ్చటి మైదానాలను చేరు కున్నాడు. తను వచ్చినకార్యం సాధించినందుకు సంతోషిస్తూ, చిన్నకొలను గట్టున దిగి, ఒక బండపై కూర్చుని, లలిత కట్టి పంపిన మూట విప్పి, అన్నం తిని చెట్టుకింద కొంతసేపు విశ్రాంతి తీసుకున్నాడు. ఆ తరవాత అరణ్యంకేసి ఒకసారి తిరిగి చూసి, విశ్వావసుకూ, లలితకూ మనసులో క్షమాపణలు చెప్పుకుని, మళ్ళీ గుర్రమెక్కి రాజధానీనగరం కేసి బయలుదేరాడు.

సాయంకాలానికి అతడు రాజధానీనగరం చేరుకుని తిన్నగా రాజప్రాసాదానికి వెళ్ళాడు. రాజు పరమానందంతో ఎదురు వచ్చి, "నీ రాకకోసం ప్రతిక్షణం ఎదురుచూస్తున్నాను. వెళ్ళిన కార్యం జయప్రదమయింది కదా!" అని అడిగాడు.

"నేను అన్వేషిస్తూ, వెళ్ళిన దివ్యప్రతిమను తెచ్చాననే భావిస్తున్నాను. అయినా..." అని ఆగిపోయాడు విద్యాపతి.

"సంకోచం లేకుండా చెప్పు, నాయనా. జీవితంలో గొప్పకార్యాలు సాధించాలంటే అవ రోధాలూ, ఆటంకాలూ తప్పవు. ఈ మహాకార్యం సాధించడానికి నీకు ఎదురైన సమస్య ఏమిటో చెప్పు. పరిష్కరించడానికి ప్రయత్నిస్తాను," అన్నాడు రాజు.

"నా బాధను ఎవరూ తీర్చలేరు ప్రభూ!" అంటూ నమ్మిన ఆప్తుల నుంచి దివ్యవస్తువును దొంగిలించుకుని వచ్చిన సంగతి చెప్పాడు బాధగా విద్యాపతి.

''నువ్వీక్షణం నుంచే ఇలాంటి ఆలోచనలను వదిలిపెట్టాలి. ఎందుకంటే, మన దేవాలయ నిర్మాణానికి దూరతీరాల నుంచి వచ్చిన వేలాదిమంది శిల్పులు రేయింబవళ్ళు తమ శ్రమను ధారపోశారు. మనమూ దీనికెంతో ధనం వెచ్చించాము; పాటుపడ్డాము. లోకక్షేమం కోసం ఈ దైవ కార్యం పూర్తికావడానికి ఇంకొకరు వేరొకదాన్ని కోల్పోవడంలో ఆశ్చర్యం లేదు. అందుకు బాధపడవలసిన అవసరం లేదు! పైగా, సముద్రంలో ఒక దుంగ కొట్టుకు వస్తున్నట్టు, నాకు కలద్వారా దివ్యసందేశం అందింది. ఆ దుంగతో దైవరూపాన్ని చెక్కి దాని లోపల నువ్వు తెచ్చిన దివ్యప్రతిమను భద్రపరచి బ్రహ్మాండమైన ఆలయంలో ప్రతిష్ఠిద్దాం. దానిని దర్శించడానికి, నీకు ఆతిథ్యమిచ్చిన ఆ మహానుభావుడు కూడా ఆనందించగలడు?'' అంటూ రాజు విద్యాపతిని ఓదార్చాడు.

మరునాడు సూర్యోదయానికి ఒక గంట ముందే విద్యాపతితో సహా రాజు, తన పరివారంతో బయలుదేరి సముద్రతీరం చేరాడు. సరిగ్గా సూర్యోదయ సమయానికి, ''అదిగో కనిపిస్తున్నది కదా! అలలమీద తేలుతూ వస్తున్నది చూడండి!'' అని అన్నాడు రాజు పట్టరాని ఉత్సాహంతో.

మరుక్షణమే, అక్కడే సిద్ధంగావున్న పది పడవలు, సముద్రంలోకి ప్రవేశించాయి. పడవలలోని మనుషులు దుంగను సమీపించి దానిని తీరంకేసి నెట్టడానికి ప్రయత్నించారు. కాని, అది కదలలేదు. ఆశ్చర్యంతో, కొందరు ఈతగాళ్ళు పడవల నుంచి నీళ్ళలోకి దూకి దుంగను ముందుకు తోశారు. కాని, అది ఏమాత్రం కదలలేదు. పడవలతో నెట్టి చూశారు. ప్రయోజనం కనిపించలేదు. దుంగకు తాళ్ళను బిగించి, పెద్దపెద్ద పడవల నుంచి గట్టుకేసి లాగారు. దుంగ ఒక్క అంగుళం కూడా ముందుకు సాగలేదు.

ఈ పరిస్థితిని చూసి రాజు విచారం చెందాడు. దీనిని తీరానికి చేర్చకుండా వెనుదిరగడం లేదు – అన్న పట్టుదలతో రాజు అక్కడే వుండిపోయాడు.

సాయంకాలమై రాత్రి అయింది. బంగారు పల్లకీలో రాణి గుండిచాదేవి సముద్రతీరానికి వచ్చి రాజును, ''ప్రభూ, తెల్లవారేవరకూ ఇక్కడే వుండిపోతారా!'' అని అడిగింది.

''ఏమి చేయడానికీ తోచడం లేదు రాణీ,'' అంటూ రాజు కళ్ళు మూసుకుని ఒక్క క్షణం ఆలోచించి, ''ఆపండి!'' అన్నాడు సముద్రంకేసి చూస్తూ. ఆ తరువాత విద్యాపతిని దగ్గరికి పిలిచి, ''దుంగ ఎందుకు కదలడంలేదో ఇప్పుడు నాకర్థమయింది. నువ్వు తీసుకువచ్చిన దివ్య ప్రతిమను, ఇంతకాలం అరణ్యంలో పూజిస్తూ వచ్చిన మహాను భావుడి వద్దకు నన్ను తీసుకుపో! ఆయన స్పర్శ మాత్రమే దుంగను కదిలించగలదు!'' అన్నాడు.



విద్యాపతి దారి చూపగా, మంత్రి దండనాథులు వెంటరాగా రాజు, అరణ్యమధ్యంలోని కోయదొర విశ్వావసు గూడెంకేసి బయలుదేరాడు. మరునాడు మధ్యాహ్నానికి వారు, కోయ గూడేన్ని ఆనుకుని వున్న కొండ మీదికి చేరారు.

ఆ కోయగూడెం ఎప్పుడూ ప్రశాంతంగానే ఉండేది. కాని, నిన్న ఉదయం నుంచి అది మరింత ప్రశాంతంగా, విషాదంతో నిండి వున్నది. రోజులాగే వేకువ జామున ఇల్లు వదలి వెళ్ళిన విశ్వావసు కొంతసేపటికల్లా తిరిగివచ్చి కూతురితో, "నీ భర్త ఎంతపని చేశాడు తల్లీ!" అని అంటూ వాకిట్లో పడి మూర్ఛపోయాడు. లలిత భయపడిపోయింది. బంధువులు విశ్వావసును ఇంటి లోపలికి చేర్చి ముఖం మీద నీళ్ళు చిలక రించారు. ఆయన మెల్లగా కళ్ళు తెరిచి, చుట్టుపక్కల కలయజూసి, మళ్ళీ బాధగా కళ్ళు మూసుకున్నాడు.

జరిగిన సంగతి లలితకు అర్థమయింది. తరతరాలుగా పూజిస్తూ వచ్చిన దివ్యప్రతిమను విద్యాపతి అపహరించుకుపోవడంవల్లే తన తండ్రి ఇలా దిగ్భ్రాంతికి లోనై, శోకమూర్తి అయ్యాడని ఆమె గ్రహించింది.

ఆ పగలూ, రాత్రీ విశ్వావసు మూసిన కళ్ళు తెరవలేదు. లలిత నిద్రాహారాలు మాని తండ్రి పక్కనే కూర్చున్నది. మర్నాడు వేకువ జామున విశ్వావసు యథాప్రకారం గుహకేసి నడిచాడు. ఆయన వెంట లలిత, ఇతర బంధుగణం బయలుదేరారు. విశ్వావసు గుహ లోపలికి వెళ్ళి, రాతిపీఠాన్ని కౌగిలించుకుని విలపించసాగాడు. అందరూ ఎంత వేడుకున్నప్పటికీ ఆయన అక్కడి నుంచి లేవడానికి ఒప్పుకోలేదు.

మధ్యాహ్నసమయానికి, ఒక కోయయువకుడు గుహకేసి పరిగెత్తుకుంటూ వచ్చి, "కొండపై నుంచి కొందరు మనగూడెంకేసి వస్తున్నారు. వాళ్ళలో రాజు కూడా ఉన్నాడు!" అని చెప్పాడు. మరి కొంతసేపటికి మరొక యువకుడు పరిగెత్తుకు వచ్చి, "వాళ్ళలో విద్యాపతి కూడా వున్నాడు!" అని చెప్పాడు.

"ఆహా, మనవద్ద వున్న దివ్యప్రతిమను అపహరించుకుపోయినప్పటికీ తృప్తి కలగ లేదన్నమాట! ఇప్పుడు మనకున్నదంతా దోచుకుపోవడానికి వస్తున్నట్టుంది!" అన్నాడు ఒక మధ్యవయస్కుడు.

"కాదు, కాదు. వస్తున్నవారెవరివద్దా ఆయుధాలు లేవంటున్నారు కదా! మనదొరను పరామర్శించడానికే, రాజుగారు వస్తున్నారు!" అన్నాడు ఒక వృద్ధుడు.

విశ్వావసు లేచి గుహనుంచి వెలుపలికి వచ్చి, చేతులు జోడించి నిలబడ్డాడు. రాజు వచ్చీ రాగానే, ఆయన్ను అమాంతం కౌగిలించుకుని, "మహాత్మా, అసలు దొంగను నేను! నీ అల్లుడు కాదు. నన్ను క్షమించు," అన్నాడు.

విశ్వావసు కన్నీళ్ళు తుడుచుకుంటూ, రాజుకు, పక్కనే



వున్న ఒక బండను చూపాడు. రాజు దానిమీద కూర్చుని, ''విశ్వావసూ, నేను చెప్పేదంతా దయతో విను,'' అంటూ, దైవ ప్రేరణతో తను పూరీ సముద్రతీరంలో ఆలయం నిర్మించిన విధమూ, ఆలయంలో ప్రతిష్ఠించడానికి విగ్రహం కోసం పండితులను పంపిన సంగతీ, విద్యాపతి చేసిన పనీ వివరించి, ''విశ్వావసూ, ఇన్ని తరాలుగా ఆ దేవుడు మీ వంశస్థుల పూజలందుకున్నాడు. ఇకమీదట భక్తులందరి పూజలూ అందుకోవాలన్నది భగవత్సంకల్పం. ఆ దివ్యప్రతిమను దుంగతో చేసే విగ్రహం లోపల భద్రపరుస్తున్నాము. అందుకు నీ అనుమతిని అర్థిస్తున్నాను,'' అన్నాడు.

విశ్వావసు మౌనంగా తలాడించాడు. ఆ తరవాత రాజు మళ్ళీ, సముద్రం అలలపై తేలుతూన్న దుంగ, తీరంకేసి కదలకపోవడం గురించి చెప్పి, ''భక్తుడయిన నీ ఆధ్వర్యంలోనే విగ్రహప్రతిష్ఠాపన జరగాలన్నది దైవసంకల్పం. కాబట్టి నువ్వు మా వెంట వచ్చి, దుంగను తాకి దైవకార్యం నిర్విఘ్నంగా పూర్తిచేయడానికి సాయపడాలి!'' అన్నాడు.

విశ్వావసు కొంతసేపు మౌనం వహించి, ''తమ ఆజ్ఞానుసారం తమ వెంట రావడానికి సిద్ధంగా వున్నాను,'' అన్నాడు.

రాజు పరమానందంతో ఆనందబాష్పాలు రాలుస్తూ విశ్వావసును మళ్ళీ ఒకసారి కౌగిలించుకుని, పక్కనే వున్న లలితకేసి తిరిగి, ''తల్లీ, నీ భర్తను అపార్థం చేసుకోవద్దు. మహోన్నతకార్యం సాధించడానికే అతడు నీ నుంచి రహస్యాన్ని దాచాడు,'' అన్నాడు.

పక్కనే వున్న విద్యాపతి, ''నీకు తెలియకుండా, నా కర్తవ్యం నెరవేర్చినందుకు నన్ను క్షమించు. త్వరలో వచ్చి నిన్ను రాజధానికి వెంటబెట్టుకుని వెళతాను, అంతవరకు ఓర్పు వహించు,'' అన్నాడు లలితతో.

మరునాడు సాయంకాలానికి రాజు తన పరివారంతో పూరీ సముద్రతీరం చేరుకున్నాడు. విశ్వావసు పడవపై సముద్రంలోకి వెళ్ళి దుంగను తాకాడు. మరుక్షణమే ఆ దుంగ అలలపై తేలుతూ తీరానికి చేరింది. రాజభటులు దానిని రాజభవనానికి చేర్చారు.

తెల్లవారగానే రాజు, ఆస్థాన శిల్పులనూ, శిల్పాచార్యులనూ పిలిపించి, '' ఈ దుంగతో ఏ దైవవిగ్రహం చెక్కితే మంచిది?'' అని అడిగాడు.

అందుకు శిల్పులు, ''శిలలను దైవవిగ్రహాలుగా చెక్కడం మాకు తెలిసిన విద్య. అయితే, దుంగతో విగ్రహాలు రూపొందించడం అన్నది మాకు అనుభవం లేనిది!'' అన్నారు ఎంతో వినయంగా.

సరిగ్గా ఆ సమయానికి అక్కడికి ఒక వృద్ధుడు వచ్చి, "రాజా, దైవప్రేరణతో మీరు నిర్మించిన ఆలయంలో అన్నా చెల్లెళ్ళయిన బలభద్ర, సుభద్రలతో కలిసి శ్రీకృష్ణ రూపంలో కొలువు తీరాలన్నది భగవత్సంకల్పం! ఈ మూర్తిత్రయం మరేదేవాలయంలోనూ కొలువు తీర లేదు. తమరు అనుమతించారంటే ఈ దుంగతోనేనా విగ్రహాలను రూపొందించగలను. అయితే, ఒక విన్నపం. కావలసిన పనిముట్లతో ఈ దుంగతోపాటు నేను ఏకాంత స్థలంలోకి వెళ్ళి తలుపులుమూసుకుంటాను. విగ్రహాల రూపకల్పన పూర్తయ్యాక నేనే తలుపులు తెరుచుకుని వస్తాను. ఈలోగా మధ్యలో ఎవరుగాని నన్ను పిలువకూడదు," అన్నాడు.

"మరి మీ ఆహారం మాటేమిటి?" అని అడిగాడు రాజు.

"పని పూర్తయ్యాక తీసుకుంటాను!" అన్నాడు వృద్ధుడు.

రాజు అందుకు అంగీకరించి, రాజభవనంలోనే ఒక విశాలమైన గదిని వృద్ధశిల్పికి ఏర్పాటు చేశాడు. వృద్ధుడు దుంగతోసహా ఆ గదిలో ప్రవేశించి తలుపులు మూసుకున్నాడు. వెలుపలి నుంచి తలుపుకు చెవి ఆనించి వింటే సుత్తి, ఉలి చప్పుళ్ళు వినిపించేవి. రాణి గుండిచాదేవి ఉత్సాహం కొద్దీ తరచూ అలా వినేది. కొన్నాళ్ళు గడిచాయి. ఒకనాడు చప్పుడు వినిపించలేదు. మర్నాడు కూడా శబ్దం రాలేదు. అన్నపానీయాలు లేక వృద్ధుడికి ఏమయిందోనన్న అనుమానం కొద్దీ రాణి తలుపు కొద్దిగా తెరిచి చూసింది.

దీక్షతో విగ్రహాలు రూపొందిస్తూన్న శిల్పి, ఆమెకేసి తలెత్తి చూసి అక్షణమే అంతర్థాన మయ్యాడు. విగ్రహాలు అసంపూర్తిగా మిగిలిపోయాయి. దేవశిల్పి విశ్వకర్మ, వృద్ధశిల్పి రూపంలో వచ్చాడని అందరూ భావించారు. తను చేసిన పనికి రాణి బాధపడింది. కాని, అంతా దైవనిర్ణయం అని భావించిన రాజు, విద్యాపతి తెచ్చిన దివ్యప్రతిమను కృష్ణ విగ్రహంలో రహస్యంగా భద్ర పరచి, లోకకల్యాణం కాంక్షించి, కృష్ణవిగ్రహంతో పాటు బలభద్ర, సుభద్ర విగ్రహాలను కూడా ఆలయంలో ప్రతిష్ఠించాడు.

అవి అసంపూర్తిగా ఉన్నా, భక్తులకు వింతరూపాలు అనిర్వచనీయమైన అందంతో దివ్యానుభూతిని కలిగిస్తు న్నాయి. విద్యాపతి వంశస్థులను రాజు ఆలయ పూజారు లుగానియమించాడు.

ఆనాటి నుంచి పూరీ శ్రీగజన్నాథ మందిరం మన దేశంలోని విష్ణుక్షేత్రాలలో ముఖ్యమైనదిగానూ, సుప్రసిద్ధ యాత్రాస్థలంగానూ వెలుగొందుతున్నది. శ్రీకృష్ణుడని తెలియక, బాణం వేసి, ఆయన ప్రాణాలు పోవడానికి కారకుడైన జరాసవరుడి వంశంవాడే విశ్వావసు అనీ, ఆయన పూజించినవి శ్రీకృష్ణుడి అవశిష్టాలనీ భక్తులు విశ్వసిస్తారు. వాటిని తరతరాలుగా నూతన విగ్రహాల



లోకి, రహస్యంగా మార్చి సంప్రదాయానుసారం పవిత్రంగా భద్రపరుస్తారు. ఈ ఆచారాన్ని 'నవకలేవర' (నూతన రూపం) అంటారు.

విద్యాపతి- లలిత వంశస్థులైన దైతపతులే ఈనాటికీ ఆలయంలో ప్రధానపూజారులుగా కొనసాగడం విశేషం.



శ్రీ జగన్నాధుడి లీలలను గురించి ప్రజలు యుగయుగాలుగా అనేక కథలు చెప్పుకుంటున్నారు. అలాంటివాటిలో రథయాత్రకూ, పూరీ రాజుకూ సంబంధించిన కథ ముఖ్యమైనది:

ఒకానొకప్పుడు కళింగ యువరాజు పురుషోత్తమదేవుడు విశాలదేశ పర్యటనకోసం పూరీ నుంచి బయలుదేరాడు. కొన్నాళ్ళకు దక్షిణప్రాంతంలోని కాంచీపురాన్ని చేరాడు. కంచి రాజు ఆయనకు సగౌరవంగా స్వాగతం పలికి అతిథిమర్యాదలు చేశాడు.

కంచిరాజుకు పద్మావతి అనే అందమైన కుమార్తె ఉన్నది. ఆమె అద్భుతమైన అందచందాలు, శాంతస్వభావం రాకుమారుడికి ఆనందం కలిగించాయి. ఆయన అక్కడే కొన్నాళ్ళు ఉండాలనుకున్నాడుగాని, తండ్రికి అస్వస్థత అని వార్త అందడంతో పూరీకి తిరిగి వచ్చాడు.

కొన్నాళ్ళకు వృద్ధరాజు మరణించాడు. యువరాజు పురుషోత్తమదేవుడు సింహాసనాన్ని అధిష్ఠించాడు. ఆయన కంచి యువరాణి పద్మావతిని పరిణయమాడడానికి ఆశిస్తున్నట్టు ఆ రాజుకు దూతద్వారా వర్తమానం పంపాడు. ఆ మాట విని కంచిరాజు పరమానందం చెందాడు. తన మంత్రిని పూరీకి పంపాడు.

అది శ్రీ జగన్నాధ రథోత్సవం జరుగుతూన్న సమయం. రథం రావడానికి ముందు కళింగ రాజు స్వయంగా మార్గాన్ని కొంతదూరం చీపురుతో చిమ్మడం తరతరాలుగా వస్తూన్న ఆచారం! రాజాధిరాజు సైతం, దేవుడి ముందు దాసానుదాసుడైన సేవకుడే అని చెప్పడానికే ఈ వింత సంప్రదాయం ఏర్పడింది!

ఆ సమయానికి అక్కడికి వచ్చిన కంచి మంత్రి ఈ ఆచారాన్ని చూసి హర్షించలేకపోయాడు. కంచికి తిరిగి వెళ్ళి, వీధులు చిమ్మే రాజుకు యువరాణినిచ్చి వివాహం చేయడం భావ్యం కాదని రాజుకు సలహా ఇచ్చాడు. రాజు కూడా దానిని ఆమోదించాడు.

పురుషోత్తముదేవుడికి ఈ సంగతి తెలిసి ఆగ్రహం చెందాడు. సేనలతో వెళ్ళి కంచిని ముట్టడించాడుకాని, ఘోర పరాజయం పాలయ్యాడు. పూరీకి తిరిగి వచ్చి, విగ్రహాలకు సాష్టాంగ దండప్రమాణంచేసి, రోజుల తరబడి భక్తితో ప్రార్థించాడు. కంచి మీదికి మళ్ళీ దండెత్తి వెళ్ళమని దివ్యస్వరం ఆదేశించింది.

పురుషోత్తమదేవుడు మళ్ళీ సేనలను సమాయత్తం చేసుకుని, అమితోత్సాహంతో కంచికేసి బయలుదేరాడు. చిలికా సరస్సు సమీపంలో ఒకవృద్ధురాలు ఎదురై ఆయన్ను ఆపి,

"నాయనా, కొంతసేపు క్రితం ఇద్దరు యువకులు ఇటు వెళ్ళారు. ఇద్దరిలో ఒకరు నల్లగా, మరొకరు తెల్లగా ఉన్నారు. ఇద్దరూ నా దగ్గర చెరొక పిడత పెరుగుతీసి తాగారు. డబ్బు అడిగితే, ఈ ఉంగరాన్నిచ్చి, 'దీన్ని చూపితే మా వెనక వచ్చే యువకుడు ఇవ్వగలడ'ని చెప్పి వెళ్ళారు," అన్నది.

రాజు ఆ ఉంగరాన్ని తీసి చూశాడు. అది శ్రీ జగన్నాథుడి వజ్రపుటుంగరం. తన ముందు గుర్రాలపై వెళ్ళిన యువకులు జగన్నాథ బలభద్రులేనని రాజు గ్రహించాడు.

ఆ తరవాత జరిగిన యుద్ధంలో పురుషోత్తమదేవుడు సునాయాసంగా విజయం సాధించాడు. కంచిరాజు బందీ అయ్యాడు. పురుషోత్తమదేవుడు అతన్ని సగౌరవంగా వదిలిపెట్టాడు కాని, యువరాణిపద్మావతిని మాత్రం వదలకుండా, బందీగా పూరీకి వెంటబెట్టుకు వెళ్ళాడు.

రాజు ఆమెను పరిణయమాడగలడనే అందరూ భావించారు. అయితే, రాజు వృద్ధమంత్రిని పిలిచి, "ఈ యువరాణిని పెళ్ళాడడానికి ఒక వీధులు చిమ్మేవాణ్ణి చూడండి," అని ఆదేశించాడు.

పద్మావతి విచారంగా రోజులు గడప సాగింది.

కొన్నాళ్ళకు మళ్ళీ రథయాత్ర సమయంసమీపించింది. బంగారపు చీపురు కట్ట చేతబట్టి, రాజు పురుషోత్తమదేవుడు, రథం వెళ్ళే మార్గాన్ని చిమ్మడానికి వంగాడు. వెనకనుంచి ఎవరో తన భుజాలను స్పృశించడం గమనించి రాజు తలెత్తి వెనక్కు తిరిగి చూశాడు. వృద్ధమంత్రి చిన్నగా నవ్వుతూ కనిపించాడు. మరుక్షణం ఆయన సైగచేయగానే, మేలి ముసుగులో ఉన్న కంచియువరాణి రాజు మెడలో పుష్పహారం వేసింది.



"రాజా! యువరాణి పద్మావతిని వివాహమాడడానికి ఒక మంచి వీధులు చిమ్మేవాణ్ణి చూడమని తమరు ఆజ్ఞాపించారు కదా. ఇప్పుడు తమరే చిమ్ముతున్నారు కదా? యువరాణి గారికి ఇంతకన్నా అర్హుడైన వరుణ్ణి భూప్రపంచంలో తేగలనా?" అన్నాడు వృద్ధమంత్రి.

రాజు మందహాసం చేస్తూ, వృద్ధమంత్రి అభీష్టానుసారం పద్మావతి మెడలో పుష్పహారం వేశాడు. ఆమె కళింగరాజ్యానికి మహారాణి అయింది!

**ఒరిస్సా పర్యాటకశాఖ ముఖ్యమైన పండుగలు/ఉత్సవాలు (2003 జూలై-డిసెంబర్)**

| పండుగ/ఉత్సవం పేరు | నెల, తేది | జరిగే ముఖ్యమైన ప్రదేశాలు |
|---|---|---|
| స్నానయాత్ర | జూన్ 14 | పూరీ |
| రథయాత్ర | జూలై 1 | పూరీ, కేంద్రపారా, బారిపడా |
| బహుధాయాత్ర | జూలై 9 | పూరీ, కేంద్రపారా, బారిపడా |
| దుర్గాపూజ | అక్టోబర్ 2-5 | కటక్ |
| గజలక్ష్మి పూజ (కుమారపూర్ణిమ) | అక్టోబర్ 9 | ఢెంకనాల్ టౌన్ |
| అనల్ నవమి | నవంబర్ 2 | సాక్షిగోపాల్ |
| బాడా ఓషా | నవంబర్ 7 | ధవళేశ్వర్ |
| బలియాత్ర | నవంబర్ 8 | కటక్, పారాదీప్, కోణార్క్, బాలూగాంవ్ |
| పారబ్ (గిరిజనోత్సవం) | నవంబర్ (6-18) | కోరాపుట్ |
| సముద్రతీరోత్సవం | నవంబర్ (23-27) | పూరీ |
| కోణార్క్ నృత్యోత్సవం | డిసెంబర్ 1-5 | కోణార్క్ |

పూరీకి చేరుకోవడం ఎలా? శ్రీ జగన్నాథ దేవాలయానికీ, రథయాత్రకూ ప్రసిద్ధిగాంచిన పూరీ నగరం భువనేశ్వర్‌కు 60 కి.మీ. దూరంలోనూ, కోణార్క్‌కు 35 కి.మీ. దూరంలోనూ ఉన్నది. కొల్‌కత, ఢిల్లీ, అహ్మదాబాద్, తిరుపతి మొదలైన నగరాల నుంచి రైలుమార్గం ఉన్నది. రాకపోకలు, వసతి సౌకర్యాల గురించిన మరిన్ని వివరాలకోసం ఈ చిరునామాను సంప్రదించండి: **ఒరిస్సా టూరిజం డెవలప్‌మెంట్ కార్పొరేషన్ (ఒటిడిసి) పాంథానివాస్ లేదా పూరీ పర్యాటకశాఖ కార్యాలయం.**

# చందమామ కబుర్లు



## కుక్కలకు ప్రత్యేక స్నానఘట్టాలు!

టోక్యోలోని కుక్కల యజమానులు, తమ పెంపుడు జంతువులు అనవసరంగా ఎక్కువ బరువు పెరగకూడదని అమితశ్రద్ధ కనబరుస్తున్నారు. అలాంటివారికి సాయ పడడానికి కొందరు కుక్కలకు ప్రత్యేక ఆరోగ్య స్నానఘట్టాలను ఏర్పాటుచేస్తున్నారు. ఇక్కడ 'ట్రెడ్‌మిల్స్' 'జాకుస్సీలు' కూడా ఉన్నాయి. 'ట్రెడ్‌మిల్' మీద పరిగెత్తించాక కుక్కలను ఔషధాలు కలిపిన వెచ్చటి నీళ్ళలో స్నానం చేయిస్తారు. ఆ తరవాత సుగంధజలంలో స్నానం చేయించి, తుడిచి వాటి శరీరాలకు తేయాకు, సైప్రెస్ నూనెలను పూస్తారు.

## 12 గంటలలో ఒక పుస్తకం!




మామూలుగా ఏప్రిల్ 23 వతేదీన ప్రపంచ పుస్తక దినోత్సవం జరుపుతారు. ఈ సంద ర్భంగా జర్మనీకి చెందిన ఒక ప్రచురణసంస్థ ఈ సంవత్సరం సరికొత్త రికార్డును సృష్టిం చింది. ఉదయం 7.45 గంటలకు 40 మంది రచయితలకు రాయడానికిఒకఅంశాన్ని ఇచ్చింది. 12 గంటల తరవాత అంటే సాయం కాలం 7.45 గంటలకల్లా పుస్తక 'ప్రతులు' 10 నగరాలలో అమ్మకానికి సిద్ధం అయ్యాయి. ఆ పుస్తక రచన, కంపోజింగ్, ముద్రణ, బైండింగ్ అంతా ఏకబిగిన ఆ పన్నెండు గంటలలోగా పూర్తయిందన్నమాట! ముందుమాటతోసహా ఆ పుస్తకం 100 పేజీలు వచ్చింది. ఈ అపూర్వ ప్రయత్నానికినేపథ్యంగా ఉన్న స్టిఫ్‌స్టన్ లెస్సెన్ సంస్థ ప్రజలమధ్య పఠనాసక్తిని పెంపొందించడానికే ఈ ప్రయోగాన్ని తలపెట్టింది. ప్రపంచరికార్డు సృష్టించడం దాని ఉద్దేశం కాదు.

## మేఘాలయ జానపద కథ

మేఘాలకు నిలయం కావడంవల్ల మేఘాలయ అన్న పేరును సంతరించుకున్న ఈ రాష్ట్రం ప్రకృతిసహజసౌందర్యానికి పేరు గాంచింది. దిగువ హిమాలయాల మధ్య ఉన్న ఈ రాష్ట్రంలో భారీగా వర్షాలు కురుస్తాయి. ఎండలు బాగా కాస్తాయి. ఎత్తయిన పీఠభూములు, జలపాతాలు, నిర్మలజలాలు నిండిన నదులు, గలగలసాగే సెలయేళ్ళు, వంకరటింకరగా పారేకాలువలు,ఈ రాష్ట్రంలో కోకొల్లలు!

ఉత్తర, తూర్పు దిశలలో అస్సాం; దక్షిణ, పశ్చిమ దిశలలో బంగ్లాదేశ్ సరిహద్దులుగా కలిగిన రాష్ట్రం మేఘాలయ. అస్సాం నుంచి వేరుపడిన మేఘాలయ 1972 జనవరి 21 నుంచి పరిపూర్ణ రాష్ట్రంగా కార్యకలాపాలు సాగిస్తున్నది.

1972 వరకు అస్సాం రాజధానిగా ఉన్న షిల్లాంగ్‌నగరమే ప్రస్తుత మేఘాలయ రాష్ట్రరాజధాని. బ్రిటిష్ పాలకులకు ఇది వేసవి విడిదిగా ఉండేది. సముద్రమట్టానికి 1,496 మీ. ఎత్తులో షిల్లాంగ్ నెలకొని ఉన్నది. ఇంతఎత్తయిన ప్రదేశంలో ఉండడం వల్లే దీనికి 'స్కాట్‌లాండ్ ఆఫ్ ది ఈస్ట్' అనే పేరు వచ్చింది.

22,000 చ.కి.మీ. విస్తీర్ణంగల ఈ రాష్ట్ర జనాభా 23,06,069. ఖాసీ, గారో ప్రధాన భాషలు. ప్రభుత్వ కార్యాలయాలలో ఇంగ్లీషునే అధికారభాషగా ఉపయోగిస్తున్నారు.

# పులిపై కాలుదువ్విన పందిపిల్ల!

పందులంటేనే మామూలుగా మురికి జీవాలనుకుంటాం.అయితే పూర్వకాలంలో అలా కాదు. అడవిలోని మిగతా జంతువుల్లాగానే పందులు కూడా శుభ్రంగానే ఉండేవట! మరి ఆ తరవాత పందులెందుకిలా మురికి కొట్టుకుపోయాయి? ఆ సంగతిని తెలియజేసే ఒక ఆసక్తికరమైన కథ ప్రచారంలో ఉంది:

మేఘాలయ ప్రాంతంలోని ఒక అడవిలో రకరకాల జంతువులు నివసిస్తూ ఉండేవి. జంతువులకు కావలసిన ఆహారం అడవిలో కావలసినంత లభించేది. అందువల్ల జంతువులన్నీచాలా సంతోషంగా ఉండేవి.





ఒకనాడు ఒక పులి వేటకు బయలుదేరింది. దానికి ఎన్నో జంతువులు ఎదురుపడ్డాయి. పులి వాటిని చంపి ఆకలి తీరేవరకు తృప్తిగా తిన్నది. ఆ తరవాత నీళ్ళ కోసం చుట్టుపక్కల కలయ చూసింది. దూరంలో చిన్న కొలను కనిపించడంతో దాహం తీర్చుకోవడానికి మెల్లగా దానిని సమీపించింది.

ఆ సమయంలో ఆ కొలనులో ఒక పంది పిల్ల నీళ్ళు తాగుతున్నది. ఎర్రటి ఎండలో, బురదలో చాలాసేపు ఆడుకోవడంవల్ల విపరీతమైన దప్పికతో, పులి రావడం కూడా గమనించకుండా పందిపిల్ల నీళ్ళు తాగసాగింది. పులి తనను సమీపించడం చూసిన పందిపిల్ల ఉలిక్కిపడింది. భయంతో గడగడ వణకసాగింది. పులి నుంచి తప్పించుకుని పరిగెత్తి పారిపోవడానికి కూడా దానికి కాళ్ళాడలేదు.

పులికూడా బాగా దాహంలో ఉండడంవల్ల పందిపిల్లను గమనించకుండా కొలను దగ్గరకు వెళ్ళి నీళ్ళు తాగబోయి, చటుక్కున తల వెనక్కు తిప్పుకున్నది. కొలనులోని నీరు బురద కంపు కొడుతున్నది. పందిపిల్ల శరీరం మీది బురద కొలనులోని నీటిని కంపుకొట్టేలా చేసేసింది. ఆ కంపునీళ్ళను తాగలేక, పులి మరొక కొలనును వెదకడానికి వెనక్కు తిరిగింది.

పులి ఎందుకు వెనుతిరిగి వెళుతున్నదో అంతుబట్టక పందిపిల్ల ఒక్క క్షణం ఆశ్చర్యపోయింది. ఒకవేళ తాను ఇక్కడ ఉండడం చూసి జడుసుకునివెళుతున్నదేమో! అవును, తప్పక అదే జరిగి ఉంటుంది. లేకుంటే ఇంతదూరం వచ్చిన పులి, నీళ్ళు తాగకుండా ఎందుకు వెనుతిరిగి వెళుతుంది? అన్న ఆలోచనలతో పందిపిల్ల ఉబ్బిపోయింది. తనకు ఏనుగంత బలం వచ్చినట్టు

## స్థానిక ప్రజలు



విభిన్న తెగల ప్రజలకు జన్మస్థానం మేఘాలయ. ఖాసీ, గారో, జైంటియా అన్నవి ప్రధానమైన తెగలు. ఒక్కొక్క తెగప్రజలూ విస్పష్టమైన లక్షణాలను కలిగి ఉన్నారు.

ఈ తెగల ప్రజలు ప్రాచీనకాలం నుంచి నేర్చిన హస్తకళ చేనేత. వస్త్రాలు నేయడంలోనూ, పేము వస్తువులు, బుట్టలల్లడంలోనూ సిద్ధహస్తులు. తుంగచాపలు, బుట్టలు, చిన్నచిన్న బల్లలు అల్లడంలో ఖాసీలు నేర్పరులు. గారోలు, జైంటియాలు వస్త్రాలు నేయడంలో సుప్రసిద్ధులు.

# జానపద నృత్యాలు



మేఘాలయలోని గారో తెగలవారికి వాంగ్లా అనే వంద మద్దెళ్ళ నృత్యం చాలా ముఖ్యమైనది. బాధల విముక్తినీ, కష్టాల అంతాన్నీ అది సూచిస్తుంది. అది మంచి పంట కోత కాలాన్ని సూచిస్తుంది. సాధారణంగా నవంబర్ నెలలో సంతానదేవుడైన సత్యోంగ్ గౌరవార్థం ఈ నృత్యాన్ని ప్రదర్శిస్తారు. రంగు రంగుల బట్టలు కట్టుకుని, తలపై ఈకల కిరీటాన్ని ధరించి పిన్నలూ, పెద్దలూ, మద్దెల మోతలకు అనుగుణంగా అందరూ నృత్యం చేస్తారు.

ఖాసీతెగ ప్రజలు అక్టోబర్-నవంబర్ నెలల మధ్య నోంగ్‌క్రెమ్ అనే నృత్యం చేస్తారు. ఇది కూడా మంచి పంటను ఇచ్చినందుకు దేవుడికి కృతజ్ఞతాపూర్వకంగా చేసే నృత్యమే. ఆరుబయట మైదానాలలో ఈ నృత్యం చేస్తారు. పట్టుబట్టలు, బంగారం, వెండి, పగడాల నగలు ధరించిన స్త్రీలు లోపల వృత్తాకారంలోనూ; పురుషులు వెలుపల వృత్తాకారంలోనూ నిలబడి వేణువులు, మద్దెళ్ళ సంగీతానికి అనుగుణంగా లయబద్ధంగా నాట్యం చేస్తారు.

భావించి, పులిని వెన్నంటి పరిగెత్తిపోయి, ''ఆగు, ఆగు, ఎందుకలా పిరికిపందలా పారి పోతున్నావు? అక్కడే ఆగు, దమ్ముంటే నాతో జగడానికి రా,'' అంటూ కాలు దువ్వింది.

పులి ఒక్క క్షణం దిగ్భ్రాంతి చెంది వెనక్కు తిరిగి చూసింది. దానికి దప్పిక ఎక్కువగా ఉంది.



పందితో వాదుకు దిగే ఓపిక లేక, ''ఈ రోజు నీతో జగడానికి రాను. రేపు ఇదేవేళకు ఇక్కడికి రా. నువ్వో, నేనో తేల్చుకుందాం,'' అని, తనదారిన వెళ్ళిపోయింది.

పులి తనను చూసి భయపడడంవల్లే, తనతో యుద్ధానికి సిద్ధంగా లేదని పందిపిల్ల భావించి పొంగిపోయింది. పట్టరాని ఉత్సాహంతో ఎగిరి గంతేసి తన నివాస స్థానానికి వెళ్ళి, బంధుమిత్రులందరినీ సమావేశపరచి, ''పులి నన్ను చూసి భయపడుతున్నది. ఇకపై నేనే అడవికి రాజును!'' అన్నది.

ఆ తరవాత అది తన కుటుంబ సభ్యులతో అడవిలో ఆ రోజు మధ్యాన్నం జరిగిందేమిటో పూస గుచ్చినట్టు విశదీకరించింది. అదిచేసిన పనికి మిగిలినపందులు బాధపడ్డాయి. పులి ఎందుకు కొలనులో నీళ్ళు తాగకుండా వేగంగా వెనుదిరిగి వెళ్ళిపోయి ఉంటుందో అవి ఊహించాయి. మూర్ఖత్వంతో దుందుడుకుగా ప్రవర్తించిన పందిపిల్లను చీవాట్లు పెట్టాయి.



పందిపిల్లకు మెల్లగా తన తప్పు తెలియవచ్చింది. పులిపై కయ్యానికి కాలుదువ్వి ఎంతటి ప్రమాదాన్ని కొనితెచ్చుకున్నదో గ్రహించి హడలిపోసాగింది. రేపు పులి తనను చంపి తినడం తథ్యం అన్న ఆలోచనతో విలవిలలాడుతూ నిలబడినచోట నిలబడలేక, ఒకచోట పడుకోలేక నానాయాతన అనుభవించసాగింది.

దాని తాతపంది, మనవడిపంది దుస్థితి చూసి భరించలేకపోయింది. దానిని ఎలాగైనా ప్రాణాలతో కాపాడాలని తీవ్రంగా ఆలోచించసాగింది. చివరకు దానికొక తరుణోపాయం స్ఫురించడంతో, మనవడిపందిని పిలిచి, "మాట ఇచ్చినట్టు రేపు పులి దగ్గరికి వెళ్ళు. లేకుంటే అది ఇక్కడికి వచ్చి నీతో పాటు మమ్మల్నందర్నీ చంపగలదు. అయితే, వెళ్ళే ముందు నీ ఒళ్ళంతా దుర్వాసన వీచేలా, దారిలో కనిపించే బురదలో, మురికిలో దొర్లి మరీ వెళ్ళు," అని సలహా ఇచ్చింది.

చావు భయంతో ఆ రాత్రంతా నిద్ర లేకుండా గడిపిన పందిపిల్ల, తెల్లవారగానే లేచి, తాతపంది చెప్పినవిధంగా, చుట్టుపక్కల కనబడ్డ బురద, మురికి అంటూ ఒక్కదానిని వదలకుండా అన్నిటి మీదాపడి పొర్లింది. ఒళ్ళంతా దుర్గంధం వీస్తుండగా పులి దగ్గరికి బయలుదేరింది.

పులి పందిపిల్ల ఎప్పుడు వస్తుందా, ఒక్క దెబ్బతో కొట్టి ఎప్పుడెప్పుడు తిందామా అని ఆశతో ఎదురుచూస్తున్నది.

పందిపిల్ల దగ్గరికి రాగానే, పులి ఒక్క అడుగు వెనక్కు వేసి, "ఏమిటీ దుర్గంధం! ఎందుకిలా కంపుగొడుతున్నావు?" అని అడిగింది కోపంగా.

"నువ్వు కోరినట్టు నీతో పోరాడడానికే వచ్చాను. అందుకు మా తాతపంది నేర్పిన కొన్ని పోరాట మెళకువలు అభ్యసిస్తూ వచ్చాను. అంతే," అంటూ పందిపిల్ల మరికొంత ముందుకు వెళ్ళింది.

పులి దాని దుర్గంధాన్ని భరించలేక పోయింది. వాంతి వచ్చి, మైకం కమ్మే పరిస్థితి ఏర్పడింది.

"వెళ్ళిపో... నా దరిదాపులకు రావద్దు. వెళ్ళు వెళ్ళు," అన్నది పులి కోపంగా.

"మరి నువ్వో నేనో తేల్చుకునే పోరాటం సంగతి ఏమిటి?" అని అడిగింది పందిపిల్ల తిరిగి వెళ్ళడానికి ఇష్టం లేనట్టు నటిస్తూ.

'మొదట ఇక్కడినుంచి వెళ్ళిపో.. పోరాటం వద్దు, ఏమీ వద్దు," అన్నది పులి దాని దుర్వాసన నుంచి దూరమైతే చాలన్నట్టు.

పందిపిల్ల, పులిబారి నుంచి తప్పించుకుని, పట్టరాని సంతోషంతో తిరుగుముఖం పట్టింది.

అది తన నివాసాన్ని చేరగానే, దాంతోపాటు ఇంట్లోని పెద్ద పందులూ, మురికిగా ఉండడం వల్లే తమకు మేలు జరిగిందని గ్రహించాయి. అప్పటి నుంచి నివాసం నుంచి వెలుపలికి వచ్చినప్పుడల్లా బురదలో దొర్లడం అలవాటు చేసుకున్నాయి. అలా చేయడం అవి ఈనాటికీ కొనసాగిస్తూనేఉన్నాయి!



# బదిలీ అయిన అదృష్టం!

హేలాపురిలో బాలయ్య, భద్రయ్య అనే యువకులు, చిన్నతనం నుంచీ మిత్రులు. ఇద్దరికీ పెద్దగా ఆస్తిపాస్తులు లేవు. ఇద్దరిలో బాలయ్య నెమ్మదస్థుడు, సద్బుద్ధి కలవాడు. భద్రయ్య బుద్ధీ, ప్రవర్తనా దీనికి పూర్తిగా వ్యతిరేకం. పరిచయస్థులనేకాక, అంతగా పరిచయం లేనివాళ్ళను కూడా అవహేళనగా మాట్లాడుతూ, వాళ్ళకు బాధ కలిగించి ఆనం దించడం, అతడి స్వభావం.

ఆ యేడు రాజధానిలో, రాజుగారి జన్మ దిన వేడుకలు వైభవంగా జరగనున్నాయని తెలిసి, ఇద్దరూ రాజధానికి బయల్దేరారు. బయల్దేరేదానికి ముందు భద్రయ్య, బాల య్యతో, "చాలాకాలం తర్వాత రాజధానికి వెళుతున్నాం. దారిలో మనం ఎన్నో వింతలూ, విశేషాలూ చూడగలం. ఎందుకైనా మంచిది, తిరిగి వచ్చేంతవరకు మనం ఎవరం ఏమైనదీ ఇతర్లకు తెలియకుండా వుండడం మంచిది, సరేనా?" అన్నాడు.

ఈ మాటలకు బాలయ్య ఆశ్చర్యపోతూనే సరేనన్నట్టు తల ఊపాడు. ఇద్దరూ మధ్యా హ్నంవేళకు దారిలో వున్న సుగంధపురి శివారు ప్రాంతానికి చేరారు. ఆ సరికి ఇద్దరికీ బాగా ఆకలి కాసాగింది. వాళ్ళు సమీపంలో వున్న ఒక పూరిగుడిసె దగ్గరకు వెళ్ళారు. ఆ గుడిసెలో, నా అన్నవారెవరూ లేని ఒకపేదరాలుంటున్నది.

బాలయ్య, ఆమెను పలకరించి, తాము రాజధానికి వెళుతున్నట్టు చెప్పి, "అవ్వా! బాగా ఆకలిగా వుంది. ఇంత అన్నం పెట్ట గలవా? నీ రుణం వుంచుకోంలే!" అన్నాడు.

"అలాగే, నాయనా! మీరు కాసేపు విశ్రాంతి తీసుకోండి," అని అవ్వ వంటపని ప్రారం భించి, కొద్దిసేపట్లో వంటకాగానే ఇద్దర్నీ భోజ నానికి పిలిచింది.

కోనే నాగవెంకట ఆంజనేయులు

ఆకలి దహించుకుపోతూండడంతో, మిత్రులిద్దరూ కాళ్ళూ చేతులూ కడుక్కుని, విస్తళ్ళముందు కూర్చున్నారు. అవ్వ వడ్డించిన చింతకాయ పచ్చడి, పచ్చిపులుసులతో వేడి వేడి అన్నం ఆవురావురుమంటూ తృప్తిగా తిన్నారు మిత్రులిద్దరూ.

తర్వాత వాళ్ళు అక్కడి నుంచి తిరిగి బయ ల్దేరుతూ, బాలయ్య, అవ్వ చేతిలో కొన్ని రాగి మాడలుంచి, "కమ్మని భోజనం పెట్టావు, అవ్వా! ఏమిచ్చినా నీ రుణం తీర్చలేం. ఈ రాగిమా డలుమాత్రం ఇవ్వగలుగుతున్నాం," అన్నాడు చిన్నగా నవ్వుతూ.

దానికి అవ్వ, "ఆకలిగొన్నవారికి ఇంత ముద్ద పెట్టడంకన్న పుణ్యం ఏముంటుంది! అయినా, పుణ్యం మాట ఏమోగాని, నాయనా, నన్ను కొన్నాళ్ళుగా ఒక విచారం బాధిస్తున్నది," అన్నది.

"ఏమిటది, అవ్వా?" అని అడిగాడు బాలయ్య.

"ఈ ముసలితనంలో కొన్నాళ్ళుగా నడుం నొప్పితో బాధపడుతున్నాను. డబ్బు ఖర్చుపెట్టి వైద్యం చేయించుకునే తాహతు లేనిదాన్ని. చాలామందిని అడుగుతున్నాను, ఈ నొప్పి నయమయ్యే చిట్కా ఏమైనావుంటే చెప్పండి," అని అడిగింది అవ్వ.

ఆ వెంటనే భద్రయ్య, ముసలావిణ్ణి ఆట పట్టించడానికి మంచి అవకాశం చిక్కిందను కుంటూ, "నీ నడుం నొప్పి నయంచేసే చిట్కా నాకు తెలుసు, అవ్వా! నీ పెరట్లో వున్న చింత చెట్టు కొమ్మకు తాడు కట్టి, దాని కొసను నీ నడుముకు బిగించుకుని, పదిసార్లు అటూ ఇటూ ఊగావంటే, నీ నడుం నొప్పి చేత్తో తీసేసి



నట్టు మాయమవుతుంది. ఒకవేళ ఆ చిట్కాకు తగ్గకపోతే, ఆ చెట్టుపక్కనే గొయ్యి తవ్వి, అందులో గొంతువరకూ మట్టి కప్పుకుని, ఒక నాలుగు గంటలపాటు నిలబడివుంటే, నొప్పి తగ్గడం నూటికి నూరుపాళ్ళు ఖాయం!" అన్నాడు.

"నువ్వేదో మంచి చిట్కావైద్యం చెప్పిన ట్టుంది, నాయనా! నడుం నొప్పి తగ్గితే నలు గురికీ నీ పేరే చెప్పుకుంటాను. ఇంతకూ నీ పేరేమిటి, నాయనా?" అని అడిగింది అవ్వ.

భద్రయ్య తడుముకోకుండా, బాలయ్య వైపు కొంటెగా చూస్తూ, "నా పేరు బాలయ్య. మాది హేలాపురి. ఘంటలవారి చెరువుదగ్గరే, నా నివాసం," అని చెప్పాడు.

అమాయకురాలైన ఆ ముసలావిణ్ణి, భద్రయ్య ఆ విధంగా ఆటపట్టించడం బాల య్యకు నచ్చలేదు. అయినా, ఆమె త్వరలోనే



ఈ చిట్కా వైద్యం అంతా వేళాకోళం అని గ్రహిస్తుందనుకున్నాడు.

తర్వాత మిత్రులిద్దరూ రాజధాని చేరుకుని, రంగరంగవైభోగంగా జరిగిన రాజుగారి జన్మదిన వేడుకలు చూసి హేలాపురి తిరిగి వచ్చేశారు.

పదేళ్ళకాలం ఇట్టే గడిచిపోయింది. ఒక నాడు బాలయ్య, భద్రయ్యలు ఊరి రచ్చ బండ దగ్గర కబుర్లాడుకుంటూండగా, ఒక కొత్త వ్యక్తి అక్కడికి వచ్చి, "ఈ ఊళ్ళో బాలయ్య అనే ఆయన ఇల్లెక్కడో మీకు తెలుసా?" అని అడిగాడు.

'నేనే బాలయ్యను. మీరెవరు? సంగతేమిటి?" అని అడిగాడు బాలయ్య.

ఆ వ్యక్తి సుగంధపురి నుంచి వచ్చాడు. సుగంధపురి శివార్లలో వుండే ఒక ముసలావిడ చనిపోతూ తన ఆస్తి మొత్తం – ఇరవై వేల వరహాలు, డాబా ఇల్లు, పది ఎకరాల పొలం, హేలాపురి ఘంటలవారి చెరువుదగ్గర వుండే బాలయ్యకు చెందేలా పత్రం రాయించింది. ఆస్తిని స్వాధీనం చేసుకోవడానికి వెంటనే బయలుదేరి రమ్మని, సుగంధపురి గ్రామాధికారి, బాలయ్యకు పంపించిన వర్తమానంతో, ఆ వ్యక్తి వచ్చాడు.

ఇది విని బాలయ్య, భద్రయ్యలు ఆశ్చర్యపోయారు. ఆ ముసలావిడ ఎవరో వాళ్ళకు వెంటనే గుర్తుకు వచ్చింది. ఆ పేదరాలికి ఇంత ఆస్తిపాస్తులు ఎలా వచ్చాయో వాళ్ళకు అర్థం కాలేదు.

వాళ్ళు ఆ మరుక్షణం బయలుదేరి సుగంధపురి గ్రామాధికారిని కలిసిన తర్వాత, జరిగిందేమిటో తెలియవచ్చింది.

భద్రయ్య ఇచ్చిన ఆకతాయి చిట్కా వైద్యం మేరకు, ముసలావిడ తన నడుం నొప్పి నయం చేసుకునేందుకు, చింతచెట్టు కొమ్మకు తాడు కట్టి, రెండవ కొసను నడుముకు కట్టుకుని ఊగింది. ఆ సమయంలో ఎండిన చెట్టుకొమ్మ విరిగి పక్కన వున్న తొర్ర లోంచి – ఆమె పూర్వీకులెవరో పెద్ద చెంబులో దాచిపెట్టిన వరహాలు బయటపడ్డాయి. చింతకొమ్మ చిట్కా, నడుం నొప్పి కుదర్చక పోవడంతో, భద్రయ్య చెప్పిన రెండో చిట్కా ప్రకారం ఆమె గొయ్యి తవ్వుతూండగా, అందులో ఒక రాగిబిందె నిండు బంగారు వరహాలతో బయటపడింది!

ఈ విధంగా ముసలావిడ దారిద్ర్యం తీరి పోవడంతో, సమర్థుడైన వైద్యుడితో వైద్యం చేయించుకుని నడుం నొప్పి నుంచి బయట పడి, చక్కని ఇల్లూ, పొలాలూ కొనుక్కుని, పనివాళ్ళను పెట్టుకుని కొంతకాలం సుఖ పడి, ఈమధ్యనే చనిపోయింది. ఆమెకు వారసులంటూ ఎవరూ లేకపోవడంతో, ఇంత సంపదకూ కారకుడైన హేలాపురికి చెందిన బాలయ్యకు తన ఆస్తి చెందాలంటూ పత్రం రాయించింది.

భద్రయ్య, ముసలావిణ్ణి ఆటపట్టించ డానికి చేసిన ఆకతాయి పనిలో భాగంగా, అతడు తన పేరు బాలయ్య అంటూ చెప్ప డంతో, ఇప్పుడు అదృష్టం బాలయ్యను వరించింది!

భద్రయ్య కారణంగా ఇంత ఆస్తి తనకు చెందడం న్యాయం కాదనిపించింది, బాల య్యకు. అతడు ఆ సంగతి గ్రామాధికారికి చెప్పి, ఆస్తిని భద్రయ్యపరం చేయమన్నాడు. ఇందుకు గ్రామాధికారి ఒప్పుకోక, ''చనిపోయే ముందు వ్యక్తులు రాసిన ఇలాంటి పత్రాలను మార్చడం ఎవరితరమూ కాదు!'' అంటూ అవ్వ ఆస్తిపాస్తులను బాలయ్యపరం చేశాడు.

ఈ జరుగుతున్నదంతా దిగాలుపడి చూస్తున్న భద్రయ్యతో, బాలయ్య, ''దిగులు పడకు, భద్రం! నీ ఆకతాయి చేష్టల కార ణంగా, మేలూ–కీడూ రెండూ జరిగినై. ఆఖరి రోజుల్లో అవ్వ అంతో ఇంతో సుఖపడింది. మనకు మాత్రం ఇది, బదిలీ అయిన అదృష్టం! ఇక నుంచయినా, పదిమందితో మర్యాదగా మసులుకోవడం అలవరుచుకో,'' అని, తనకు సంక్రమించిన ఆస్తిలో సగం భద్ర య్యకు రాసి ఇచ్చాడు.



# మనదేశం గురించి తెలుసుకుందాం

1. మన పురాణాల ప్రకారం దేవగురువు ఎవరు?
   ఎ) శుక్రాచార్యుడు
   బి) ద్రోణాచార్యుడు
   సి) బృహస్పతి
   డి) వేదవ్యాసుడు
2. ఆధునిక 'పై' విలువను గణించిన ప్రాచీన భారతీయ శాస్త్రవేత్త ఎవరు?
   ఎ) ఆర్యభటుడు
   బి) భవభూతి
   సి) వరాహమిహిరుడు
   డి) భాస్కరాచార్యుడు
3. పూసా ఇన్స్టిట్యూట్‌గా ప్రఖ్యాతిగాంచిన విద్యాసంస్థలో బోధించే ప్రధాన పాఠ్యాంశం ఏది?
   ఎ) ఖగోళశాస్త్రం
   బి) గణితం
   సి) వ్యవసాయం
   డి) గణాంకాలు



4. ఉత్తరభారతదేశంలో విశ్వవిద్యాలయాన్ని స్థాపించిన విద్యావేత్తచిత్రం ఇది. ఆయనఎవరు? ఆయనస్థాపించినవిశ్వవిద్యాలయం పేరేమిటి?

5. ఒకప్పటి 'థాంసన్ కాలేజ్ ఆఫ్ ఇంజనీయరింగ్' ఈనాడు ఒక సుప్రసిద్ధ విశ్వవిద్యాలయంగా అభివృద్ధిగాంచింది. అది ఏది?
   ఎ) అణ్ణా విశ్వవిద్యాలయం
   బి) జాదవ్‌పూర్ విశ్వవిద్యాలయం
   సి) రూర్కీ విశ్వవిద్యాలయం
   డి) కాకతీయ విశ్వవిద్యాలయం
6. భారతదేశంలో 'ఆంథ్రొపాలజీ' విభాగం అభివృద్ధికావడానికి సన్నిహిత సంబంధం కలిగిన విద్యావేత్తఎవరు?
   ఎ) డా. ఎ.లక్ష్మణస్వామి మొదలియార్
   బి) డా. ఎల్.కె. అనంతకృష్ణ అయ్యర్
   సి) డా. అమర్త్యాసేన్
   డి) డా. అశుతోష్ ముఖర్జీ

(సమాధానాలు వచ్చే సంచికలో)

## జూన్ క్విజ్ సమాధానాలు

1. సి) డెక్కన్ క్వీన్
2. ఎ) గోల్ గుంబజ్
3. సి) హైదరాబాద్
4. టెన్సింగ్ నార్గేతో కలిసి 1953 మే 29 వతేదీ ఎవరెస్టు శిఖరాన్ని అధిరోహించిన సర్ ఎడ్మండ్ హిల్లరీ.
5. (ఉదకమండలంలోని) మేట్టుపాళయం ఊటీ స్టేషన్లమధ్య నడిచే రైలు ఆవిరి యంత్రంతోనే నడుస్తుంది. చిత్రంలో చూపినట్టు డీజల్ విద్యుత్తుతో నడవడం లేదు.
6. (జి) భోలు



# విఘ్నేశ్వరుడు

గుహద్వారాన్ని మూసి ఉన్న కొండంత రాతిని గులకరాయిలాగ తొండంతో లాగేసి, గజ రాజు లోపలికివెళ్ళి కొంతసేపయ్యాక రత్నాల నగలను కట్టలు కట్టలుగా తొండంతో తీసు కొచ్చి సౌదామిని ముందు కుప్పవేసింది. చంద్రహారాల్నీ, కంఠాభరణాల్నీ ఆమె మెడ నిండా వేసి, తండ్రి బిడ్డను బుజ్జగించి చెప్పి నట్లుగా వీపు నిమిరి, మిగతా నగలను ధరిం చినన్ని ధరించి, తక్కినవి మూటగట్టుకొని తీసుకెళ్ళమని సైగచేసి చెప్పింది.

సౌదామిని అలాగేచేశాక, ఏనుగు ఆమెను మెల్లగా అరణ్యం దాటించి కళ్యాణినగర సమీపాన విడిచి, అరణ్యంలోకి వెనుతిరిగి వెళ్ళిపోయింది.

బంగారువిగ్రహంలాగ నగలతో తళుక్కు, తళుక్కున దేదీప్యమానంగా మెరుస్తున్న కోడలిని చూసి కలహకంఠి నిర్ఘాంతపోయి, కొంతసేపటికి సంబాళించుకొని, మెల్లమెల్లగా ఆ నగలన్నీ ఎలాగ వచ్చాయో చెప్పేవరకూ వేధించి, సౌదామిని చెప్పినదంతా విని, "ఏను గకు వెలగపళ్ళు అంత ఇష్టమన్నమాట!" అని తల పంకించి, వెంటనే సంతకు వెళ్ళి సంచి నిండా వెలగపళ్ళు కొనుక్కు వచ్చింది.

నగలు నింపుకొని రావడానికి ఒక గట్టి గోతాన్ని భుజానవేసుకొని, వెలగపళ్ళ సంచితో ఉత్సాహంగా అడవికేసి కలహకంఠి బయలు దేరింది.

అరణ్యం ప్రవేశించి కోడలు చెప్పిన గుర్తుల ప్రకారం ఎంతవెతికినా వెలగచెట్టు కనపడక విసిగి, ఒక చింతచెట్టు కింద చతికిలబడి, తినాలని వెలగపండు తీసింది.

తినాలనే తీసినా ఎలాగో నిగ్రహించుకొని, వెలగపండు చేత్తో ఎత్తి పట్టుకొని, చుట్టు పక్కల కలయజూసి గొంతు సవరించుకొని,



''ఏనుగా రా రావే!
వెలగపళ్ళు తినవే!
''నగలెన్నో తేవే!
నా కోర్కె తీర్చవే!
ఏనుగా రా!
వేగంగా రా!'' – అంటూ భజనపాట మొదలుపెట్టింది. పాట సాగుతున్నది. ఏనుగు రాలేదుగాని, అడవి దద్దరిల్లేలాగ గాంండ్రుమనే అరుపు వినిపించింది. అది ఏనుగు ఘీంకారం కాబోలు అనుకొని కలహ కంఠి సంతోషపడుతూ మెడ చాచి చూడగా దూరంలో పెద్దపులి దూకుతూ రావడం కనిపించింది. భుజం మీది గోతాన్ని వదల కుండా కలహకంఠి తిరిగి చూడకుండా పరుగెత్తి, పరుగెత్తి రొప్పుతూ పడిపోయింది. ఆ పడడం సరిగా గుహ దగ్గరే పడింది. గుహ తెరిచే ఉంది. తన అదృష్టానికి కలహకంఠి పొంగిపోతూ గుహలోకి వెళ్ళింది.

గుహలో కుప్పలు తెప్పలుగా ఉన్న నగలు చూసి పిచ్చెత్తినదానిలాగ తల ముని గేలాగ నగలన్నీ వేసుకొని, గోతం నిండా నగలు కుక్కి మూతి కట్టి, ఎత్తలేక ఎత్తి, మోయలేక మోస్తూ, నడవలేక నడుస్తూ గుహ మొదటికి వచ్చేసరికి గుహ మూత బడిఉంది. ఎదురుగా చీకటిలో ఎర్రగా నిప్పుకణికల్లా మెరుస్తున్న కళ్ళతో, తెల్లగా మెరుస్తున్న కోరపళ్ళతో పగలబడి నవ్వు తున్న పెద్ద బ్రహ్మరాక్షసి చీకటిలో చీకటిలాగ కనిపించింది.

ఆ భూతం ప్రతిధ్వనితో గుహ కంపించి పోయేలాగ, ''ఓహ్హో! కలహకంఠీ! నువ్వు కోడలిని కాల్చుకుతినే అత్తవైతే, నేను అత్తను చిత్రహింసతో తినేసిన మహాగొప్ప కోడల్ని! నా చరిత్ర విను!'' అంటూ చెప్పడం ప్రారం భించింది:

వెనుకటికి నేను చురకత్తిలాంటి అంద కత్తెను. అమ్మా నాన్నా పెట్టిన పేరు కలహంసి; కాపురానికెళ్ళాక, నా నోటి ప్రతాపానికి ఆ పేటంతటికీ నేను సంపాదించుకొని సార్థక పరుచుకొన్న పేరు కలహదుందుభి.

నువ్వెంత చెడ్డ అత్తవో, కలహకంఠీ! నా అత్తఅంత ఉత్తమురాలు, అమాయకురాలు, పరమసాధువు.

నేను కాపురానికి వెళ్ళి ఏడాది తిరక్కుండానే నా మొగుడు ఇల్లు విడిచి దేశాలపాలయ్యాడు. అంటే నేనెంత ఉత్తమ ఇల్లాలినో ఊహించుకో! నాకు నగల పిచ్చి ఇంతా అంతా కాదు. బంగారు పంటలు పండే భూములు పుట్రలు అమ్మించి రకరకాల నగలు చేయించుకున్నాను. మా అత్త

ముక్కుపుల్ల నుంచి అన్నీ నాకే ఇచ్చేసింది. అటువంటి అమాయకురాలైన అత్తను, ఒక పూటైనా సరిగా తిననిచ్చేదాన్నిగాను. చిక్కి శల్యమైన వృద్ధురాలిచేత ఇంటి చాకిరీ అంతా చేయించేదాన్ని.

చివరికి నా అత్త, మామ విసిగిపోయి వాతాపిక్షేత్రంలోని విఘ్నేశ్వరుని దర్శించి అక్కడే కన్ను మూద్దామని బయలుదేరారు. ఆ సమయంలో నా అత్త చేతుల్లో ఉన్న చిన్న మూట చూసి అదేమిటని దూకుడుగా దాన్ని లాక్కోవడంతో, ఆవిడ తూలి కిందపడిపోయి, ఆయాసంతో రొప్పుతూ కన్ను మూసింది.

అంతవరకూ ఎంతో సహనంతో నా అత్యాచారాలన్నీ చూస్తూ పల్లెత్తు మాట అనని నా మామగారు, భార్య మరణాన్ని చూసి అపలేని దుఃఖంతో, పైకుబికిన కోపంతో, ''పాపిష్ఠి దానా! ఎంత ఘోరానికి ఒడిగట్టావు? నువ్వు మా కోడలివైపోయినావు. లేకుంటే శపించే వాణ్ణి! ఎప్పటికైనా, మా ఒక్కగానొక్క కొడుకు తిరిగి వస్తాడనీ, నువ్వు వాణ్ణి సుఖపెట్టగలవనేఆశతో, అన్నీ సహించాము; కడసారి కోరుతున్నాను - వాడొస్తే సరిగా చూడు!'' అని చెబుతూ అలాగే ప్రాణాలు విడిచి భార్యతోనే సహగమనం చేశాడు. ఆయన గొప్ప నిష్ఠాపరుడు, తపశ్శాలి.

అదే సమయంలో, ఒక సన్యాసి అక్కడికి వచ్చాడు. నా అత్తమామల మృతదేహాలపై పడి భోరున రోదిస్తూ, నేను లాక్కోబోయే టప్పుడు కిందపడిన మూటను తీసి విప్పాడు. అందులో రెండు చిరుగుల బట్టలు తప్ప మరేమీ లేవు.



ఆ సన్యాసి నన్ను వజ్రాల్లాంటి కళ్ళతో కాల్చేస్తున్నట్టు చూస్తూ, ''నువ్వు బ్రహ్మ రాక్షసిగా పుట్టవలసినదానివి!'' అని అన్నాడు. అంతే, తర్వాత వృద్ధ దంపతుల ఉత్తరక్రియలు జరిపి వెళ్ళిపోయాడు.

ఆ సన్యాసి ఎవరో కాదు, నా రూప విలాసాలకు పరవశించి కోరి చేసుకున్న నా భర్తే! అని బ్రహ్మరాక్షసి చెప్పి కాస్సేపాగి మళ్ళీ చెప్ప సాగింది:

నా నగల పిచ్చి, ధనవ్యామోహం నన్ను ఎంతవరకు ఈడ్చుకు వచ్చాయంటే, నేను కొంతమంది గజదొంగలను చేరదీశాను. దొంగల రాణిని అనిపించుకున్నాను. ఈ గుహలోనే దొంగలు గొప్పగొప్ప నగలను ధనరాసులను పోగుపోస్తూండేవారు. అంతా నా స్వంతం చేసుకోవాలన్న పేరాశతో ఒక నాడు దొంగలకు విషభోజనం పెట్టాను. వాళ్ళు చచ్చేముందు చావు తెగింపుతో కసిగా నన్ను



ఇందులో ఉంచి గుహను పెనుబండతో కప్పేశారు.

కలహకంఠీ! ఇదే గుహలో, ఆ నగల్నీ, ధనరాసుల్నీ చూసుకుంటూ అలాగే మాడి మాడి కన్ను మూసి, ఇలాగ భూతాన్నయి పడి ఉన్నాను. నీకు బుద్ధి వచ్చేలాగ చేస్తే, నా పిశాచజన్మ శాపం తీరిపోతుందని, నీ కోడలి కారణంగా నిన్న ఈ గుహలోకి వచ్చిన ఏనుగు వలన తెలిసింది.

ఏనుగు నీ కోడలికి ఇచ్చినవన్నీ అసలు నగలే; ఇప్పుడు నువ్వు పెట్టుకున్నవీ, అత్యాశ కొద్దీ పోగుచేసి గోతాం నిండా కట్టుకున్నవీ ఏమిటో ఒక్కసారి చూసుకో! అన్నది బ్రహ్మ రాక్షసి.

కలహకంఠి భుజానికెత్తుకొన్న గోతం కట్టు విడి దాంట్లోంచి పాములూ, జెర్రులూ, కొండతేళ్ళూ ఊడిపడుతూ జరజరా గుహ నలుమూలలకూ పాకాయి.

ఒంటిమీద పాములూ, తేళ్ళూ పాకుతూంటే బెంబేలు పడిపోతున్న కలహకంఠిని చూసి గుహ మారుమ్రోగుతూండగా బ్రహ్మ రాక్షసి వికవికా నవ్వుతూ, "నువ్వు కోడలిని కాల్చుకు తినే కలహకంఠివి, నేను అత్త మామల ఉసురుపోసుకున్న కలహదుండు భిని! ఉత్తమురాలైన నీ కోడల్ని మంచిగా చూసుకొంటే సరేసరి, లేదా ఈ గుహలో నాలాగ బ్రహ్మరాక్షసివై పడి ఉండటం ఇహ నీ వంతు అవుతుంది! విన్నావా, కలహకంఠీ!" అని చెప్పింది.

కలహకంఠి లెంపలువేసుకొని, రాక్షసికి దణ్ణంపెట్టి, "బుద్ధివచ్చింది, కోడల్ని పువ్వు లాగ చూసుకుంటాను. గుహ నుండి నన్ను బయటపడనిచ్చి, అరణ్యం దాటించు!" అని మొరపెట్టింది.

బ్రహ్మరాక్షసి కలహకంఠిని అడవి దాటించి కళ్యాణినగరం పొలిమేరకు చేర్చి, "మాట తప్పావో, బ్రహ్మపిశాచివై గుహలో ఉంటావు, జాగ్రత్త!" అని హెచ్చరించి భగ్గుమని మండిపోయి అదృశ్యమైంది.

కలహకంఠి బ్రతుకు జీవుడా అని ఇంటికి బిరబిరా వెళ్ళి, సౌదామిని ముందు మోకరిల్లి, మోకాళ్ళు పట్టుకొని, "అమ్మా, సౌదామినీ! నన్ను మన్నించు. కొడుకూ, కోడలూ చిలకా గోరువంకల్లాగ ఉంటే చూసి సంతోషించడం కంటే నాకీ జన్మకు కావల్సిందేమీ లేదు!" అన్నది.

అత్త పరివర్తనానికి కారణం విఘ్నేశ్వరుడి కటాక్షం అని సౌదామిని సంతోషించింది. కలహ కంఠి తిరిగి కలకంఠి అనిపించుకొన్నది.

పావనమిశ్రుడు కథను ముగించి, "పిల్లలూ! ఏనుగు ఎవరో చెప్పుకోండి చూద్దాం!" అన్నాడు.

పిల్లలే కాకుండా, పెద్దలు కూడా ఆనందోత్సాహాలతో గొంతెత్తి, "విఘ్నేశ్వరుడు! మన విఘ్నేశ్వరుడే!" అంటూ గొల్లున లేచి ప్రసాదం తీసుకొని ఇళ్ళకు వెళ్ళారు.

ఆలయ మంటపంలోని కుడ్యచిత్తరువులకు సంబంధించిన కథలను, రోజూ పావనమిశ్రుడు చెబుతూంటే, వీనుల విందుగా వింటూన్న పిన్నల, పెద్దల మనస్సులనిండా, విఘ్నేశ్వరుడిపై బలమైన భక్తి వర్ధిల్లింది.

ఒకనాడు ఒక సంగీత కళాభిమాని, ఒక కుడ్యచిత్తరువులో తంబుర మీటుతూ ఒక విద్వాంసుడు గానం చేస్తూంటే, వివిధ భంగిమల్లో విఘ్నేశ్వరుడు నృత్యం చేస్తూండడం చూసి, ఆ చిత్ర చరిత్ర చెప్పమని కోరాడు. పావనమిశ్రుడు చెప్పడం మొదలుపెట్టాడు:

వాతాపినగరం కళలకు కాణాచిగా కవిపండిత, గాయక, విద్వాంసులకు పుట్టినిల్లై విలసిల్లుతూన్నది.

గజాననపండితుడు నగరంలో అగ్రగణ్యుడు, బహుముఖ ప్రజ్ఞాశాలి; ముఖ్యంగా గొప్ప గాయకుడు. అతని గాత్రంలో సమ్మోహనశక్తి ఉండేది. వాతాపిగణపతిపై ఎన్నెన్నో కీర్తనలు రచించి పాడుతూండేవాడు. అతని మనుమడు బాలగణేశభట్టు టింగుటింగున తాళాలు వాయిస్తూండేవాడు.

గజాననుడు 'ధిమికిట ధిమికిట తాండవ నృత్యకరీ గజానన...' అనే పల్లవిని ఎత్తుకొని ఆనందపారవశ్యంతో రాగాలు మారుస్తూ, అనేక రాగాల్లో పాడుతూంటే, గజాననుడైన



విఘ్నేశ్వరుడు ఇంద్రధనుస్సు రంగుల్లో అనేక రూపాల్లో నర్తిస్తూ శ్రోతల కన్నులకు కట్టేవాడు.

హంసధ్వని రాగంలో తెల్లని రాజహంస లాగ, మాయామాళవరాగంలో ఉదయరవి బింబంలాగ, భైరవిరాగంలో ఎర్రతామరలాగ, హిందోళరాగంలో నీలాకాశంలాగ, నీలాంబరిరాగంలో నీలికలువలాగ, ఆనందభైరవి రాగంలో అరవిచ్చిన తెల్లకలువలపై విరిసిన పున్నమివెన్నెలలాగ విఘ్నేశ్వరుడు లీలగా కనిపించేవాడు.

గజాననపండితుడికి సత్కారాలమీద, సన్మానాలమీద కాంక్ష ఏ కోశానా లేకపోయినా, అత్యున్నత సత్కారమైన బంగారుగణేశ ప్రతిమ అతనికే ప్రతి సంవత్సరం వస్తూండేది. ఆ ప్రతిమలతో అతని ఇల్లు నిండిపోయింది.

దేశాంతరంగా చాలామంది మహామహా విద్వాంసులకే గజాననుడంటే ఎనలేని గౌరవమూ, గురుభావమూ ఉంటున్నా, వాతాపి నగరంలో కొంతమందికి అతనిపై అసూయ బాగా పెరిగింది. వారందరికీ నాయకుడు స్వరకేసరి.

స్వరకేసరి ఎప్పుడూ విద్వత్తు చూపడానికి గొప్ప తాపత్రయపడేవాడు. అతను గళం విప్పితే సింహగర్జనలు వెలువడేవి. మద్దెల వాయించేవాడిని ముప్పుతిప్పలు పెడుతూ వీరవిహారం చేస్తున్నట్లు పాడేవాడు. గజానన పండితుడికి అటువంటి విద్వత్తు ప్రదర్శించుకోవాలనే యావ లేకపోవడమే కాకుండా, విఘ్నేశ్వరుడిపై భక్తితో తన్మయావస్థలో పడి తాళం తప్పుతూ, మరొకప్పుడు పాడుతూ, పాడుతూ మూగబోతూండేవాడు. అటువంటి సందర్భాలను స్వరకేసరి ప్రభృతులు గజాననుడికి శాస్త్రపాండిత్యం లేదనీ, కేవలం అతనిది మనోధర్మగానమనీ గాలిపాట అనీ హేళనగా ప్రచారం చేస్తూ, అక్కసు తీర్చుకుంటూండేవారు. గజాననుడికి ఎవరేమన్నా, ఏమనుకుంటూన్నా ఆ ధ్యాసే ఉండేది కాదు. మనసులోని విఘ్నేశ్వరుడితో ఏకాంతంలో మంతనాలాడుకొంటున్నట్లు పాడేవాడు. అందులో ఏదో అనిర్వచనీయమైన శక్తి వింటున్నవారిని మైమరపించి దివ్యలోకాల్లోని ఆనందసాగరాల్లో ముంచి తేల్చేది.

ఏవిధంగానైనా ఆ సంవత్సరం స్వర్ణగణేశ విగ్రహం గజాననపండితుడి ఇల్లు చేరకుండా చేయడానికి స్వరకేసరి బాగా ఆలోచించి, ఒక గొప్ప పథకం వేశాడు.





# యువరాణి చందమామలు

పూర్వం రాజస్థాన్‌లోని ఒక పట్టణంలో, లీలావతి అనే యువరాణి వుండేది. ఆమె వయసు ఎనిమిదేళ్ళు. ఒకసారి, ఆ బాలిక తీపి తినుబండారాలు అధికంగా తిని అస్వ స్థురాలయి మంచం పట్టింది.

రాజవైద్యుడు ఆమెను ఎన్నోరకాలుగా పరీక్షించి, రాజుగారి కోసం కబురంపాడు. రాజు, తన కూతురు గదిలోకి హడావిడిగా వస్తూనే, యువరాణి చేతిని తన చేతుల్లోకి తీసుకుని, ''అమ్మా, నీవు మనసులో దేన్న యినా కోరుకుంటున్నావా?'' అని ఆత్రంగా ప్రశ్నించాడు.

''అవును, నాన్నా! నాకు చందమామ వెంటనే కావాలి. అది దొరికిన మరుక్షణం, నేను మంచంలోంచి లేచి మామూలుగా ఆడుకుంటాను,'' అన్నది లీలావతి చిన్న గొంతుతో.

ఆ రోజుల్లో రాజ్యాలేలేరాజులలో కొందరికి ఎక్కడలేని అహంతోపాటు, అంతో ఇంతో తలతిక్క కూడా ఉండేది. కూతురు చంద మామకావాలనగానే రాజు, ''ఓస్, ఇంతేనా! నువ్వేం బెంగపడకు. ఆ చందమామ ఇక నీ చేతుల్లో వున్నదే అనుకో,'' అంటూ, సేనా పతిని పిలిపించాడు.

సేనాపతి రాగానే రాజు, ''యువరాణి లీల కోసం చందమామ కావాలి. అప్పుడుగాని ఆమె ఆరోగ్యం కుదుటపడదు. రేపటిలోగా దాన్ని ఎలాగైనా తెప్పించండి!'' అని ఆజ్ఞా పించాడు.

''చందమామా!'' అంటూ సేనాపతి ఆశ్చ ర్యపోయి, తలను నిమురుకుంటూ, ''ప్రభూ! ఇంతకాలంగా యువరాణి కోరినవన్నీ తెప్పించాను - ఏనుగు దంతాలు, నెమళ్ళు, కోతులు, రత్నమాణిక్యాలు. కానీ చంద మామను తీసుకురావడం మాత్రం నావల్ల కాదు. ఎందుకంటే, అది మనకు ఐదువేల యోజనాల దూరంలో వుంది. పైగా, అది పరిమాణంలో యువరాణిగారి గదికన్నా

మేకల మదన్‌మోహన్‌రావు



ఏడింతలు పెద్దది; రాగితో చేయబడింది. అలాంటి చంద్రుణ్ణి తీసుకురాలేను, దయ దలచి మన్నించండి!'' అని విన్నవించు కున్నాడు.

ఆ జవాబుతో రాజు ఉగ్రుడైపోయి, ''తక్షణం మా సమక్షం నుంచి వెళ్ళిపో. ఆస్థాన ఐంద్రజాలికుణ్ణి పంపించు!'' అన్నాడు తీవ్రస్వరంతో.

ఐంద్రజాలికుడు క్షణాలమీద వచ్చి, రాజు చెప్పింది విని, ''ప్రభూ! ఇప్పటివరకూ యువరాణి కోసం ఎన్నో ఇంద్రజాల విద్యలు ప్రదర్శించాను. అద్భుతమైన ఏడు జతల పాదరక్షలు ఇచ్చాను. మంత్రదండాలు... ఇంకా ఎన్నో ఇచ్చాను. కానీ, చంద్రుణ్ణి మాత్రం నేనేకాదు ఎవరూ తీసుకురాలేరు. అది మనకు, నాలుగు వేల యోజనాల దూరంలో వుంది. పైగా, తమ రాజమందిరం కన్నా పదింతలు పెద్దదిగా వుంటుంది. అది స్వచ్ఛమైన వెన్నమీగడలతో తయారుచేయ బడింది. దయచేసి, మన్నించండి!'' అన్నాడు.

రాజు, ఐంద్రజాలికుడి జవాబుకు కోపంగా పిడికిలి బిగించి, అతణ్ణి పంపించి, ఆస్థాన గణితశాస్త్రజ్ఞుణ్ణి పిలిపించి, అతడు గదిలోకి రాగానే, ''ఎన్నో సంవత్సరాల నుంచి నువ్వు మా కోసం ఏమేమి చేశావో ఇప్పుడు ఏకరువు పెట్టవద్దు. యువరాణి కోసం చందమామను తీసుకురావడానికి లెక్కలు వెయ్యి!'' అన్నాడు.

గణితశాస్త్రజ్ఞుడు ఏవేవో లెక్కలు వేసి, ''ప్రభూ! అది మనకు, మూడువేల ఇరవై ఆమడల, నాలుగు క్రోసుల దూరంలో వుంది. నాణెం మాదిరిగా చదునుగా వుండి ఇసుకా, సున్నంలాంటి మిశ్రమాలతో చేయబడింది. అంతేకాదు, ఆకాశానికి గట్టిగా అతికించబడి వున్నది. నేనేకాదు, ఎంతటివారూ తీసుకు రాలేరు. కరుణించి నన్ను మన్నించండి!'' అన్నాడు.

ఇందుకు రాజు భగ్గుమని, అతణ్ణి వెళ్ళ మని, ఆస్థానవిదూషకుణ్ణి పిలిపించాడు. అతడు రాగానే, యువరాణి అస్వస్థత గురించి చెప్పి, ''సేనాపతీ, ఐంద్రజాలికుడూ, గణిత శాస్త్రజ్ఞుడూ - వీళ్ళకు చందమామ ఎంత దూరంలో వున్నదన్న విషయంలోనే ఏకాభి ప్రాయం లేదు! ముగ్గురూ యోజనాల తేడా చెబుతున్నారు,'' అన్నాడు ఆవేశంగా.

ఆస్థాన విదూషకుడు, ''ఆశ్చర్యం, ప్రభూ!'' అని, ''వాళ్ళందరూ మహామేధావులు. ఒక వేళ వాళ్ళు చెప్పిందే నిజమేనేమో. కానీ,